# నివేదన

ప్రాచీన భరతవర్షము విజ్ఞానజిజ్ఞాసువుల తీర్థభూమి. భారతీయులు కత్తినెత్తి విదేశములలో సామ్రాజ్య స్థాపనకుఁ బ్రయత్నించిన ఘట్టము చరిత్రలలో మృగ్యము. కాని భారతీయ విజ్ఞాన దిగ్విజయయాత్ర ప్రాచీన కాలమున ఖండఖండాంతరములలో నిరంతరాయముగ సాగినది.

అరణ్యములు, ఆశ్రమములు, దేవాలయములు బౌద్ధ విహారములు అగ్రహారములు ప్రాచీన భారతీయ విద్యాలయములు. తక్షశిల, నాగార్జున నాలందా విహారములు విశ్వ విద్యాలయములు. అచ్చటి పండితులు జంగమ విశ్వ విద్యాలయములై చీనా, జపాను మున్నగు దేశములలో విజ్ఞాన ప్రబోధము కావించిరి. పాహియాన్, యువాన్‌చాంగ్, ఇట్సింగ్, ప్రభృతులు నాలందా విశ్వవిద్యాలయమునకు జిజ్ఞాసువులై చీనా నుండి తరలి వచ్చిరి.

ప్రపంచ చరిత్రలో భారతీయసాహిత్య దిగ్విజయ యాత్ర యనన్యఘట్టము. అధునాతన చారిత్రక పరిశోధనల వలన తేలిన నీ యంశములను బొందుపరచుటకుసల్పిన కృషియే యీగ్రంథము.

దయతో పరిచయ వాక్యముల ననుగ్రహించిన శ్రీమాన్, గ. శ్రీ. స. ఆచార్యులవారికి నమోవాకములు.

ఈగ్రంథరచనలో నా కెన్నియో యమూల్యమైన సలహాల నిచ్చిన, శ్రీసండూరి రామకృష్ణమాచార్య, ఎం. ఏ. గారికి నా ధన్యవాదములు.

సమ్మాళ్వారు

ఈ పుస్తక రచనకు తోడ్పడిన గ్రంథములు :


1. ఉపనిషత్తులు

2. India and China

   Dr, S. Radhakrishna.

3. Discovery of India

   Pandit Jawaharlal Nehru.

4. Indian Teachers of Budhist Universities

   P. Basu.

6. Itsing

   Taka Kusu.

7. Yuan Chang

   Watters.

8 Ancient Indian Education

   Radha Kumud Mukherjee

9. History of Midhila

   M. Chakravarti.

# — పరిచయం —

నాగరకతాశూన్యములై అజ్ఞానావస్థలో విదేశము లిం
ప పరిభ్రమించుచున్న రోజులలో ప్రాచీన భరత వర్షము
గరకతయందు విజ్ఞానమునందలి పరాకాష్ఠను బొందియుండె
న్న విషయము మనకందఱకు గర్వకారణము. నేడీపరిస్థితి
రీతమైనను ఆ ప్రాచీన సంస్కృతి చరిత్ర మాత్రము నేటికిని
ర్వ హిందూదేశ వైభవమునకు ధ్వజప్రాయమైయున్నది.

ఒక దేశ సంస్కృతి యున్నతస్థితియందుండుటకుఁ గారణ
ా దేశ విద్యావిధానమే. మన ప్రాచీన భరతవర్షము, తాను
స్కృతి మహితమగుటయే గాక తన విజ్ఞాన దిగ్విజయయా
స్తు ప్రయాణాది సౌకర్యములేని యా ప్రాచీన కాలమున
ండఖండాంతరముల నిరంతరాయముగ సాగించియున్న దన్న
ే ఆ గౌరవమంతయు, నాటి విశ్వ విద్యాలయముల కే
ందును. అట్టి ప్రాచీన భారత విశ్వవిద్యాలయముల మహత్తర
రిత్రను సంగ్రహరూపములో స్పష్టముగ సరళముగ విద్యార్థు
కందిచ్చిన శ్రీ సమ్మాళ్వారుగారెంతయు ప్రశంసాపాత్రులు.

"అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ."

ఇదియే భారతీయ విజ్ఞాన పరమార్థము. గ్రంథకర్త
ారు నుడివినట్లు ఇది భారతీయ జిజ్ఞాసువు, మానవ చరిత్ర

యొక్క ప్రాగుపస్సులలో నాలపించిన ప్రార్థనాగీతము. దీనితో ప్రారంభమైన యీ చరిత్ర కథనము ప్రారంభమును వేదవిద్యలను వానితోబాటుగా నభివృద్ధిపొందిన లౌకిక వాఙ్మయమును, కళలను స్పష్టము చేయుచున్నది.- పిమ్మట బౌద్ధయుగ విస్ఫులీకరణము. భారతదేశమున నాదినుండియు విద్యకు మతమునకు నవినాభావ సంబంధమనుట స్పష్టము. విదేశముల విద్యాప్రచారముతోబాటు బౌద్ధమతము భారతదేశమునకు గావించిన మహోపకారములలో ప్రధానమైనది శిల్పకళకు నజరామరత్వమును గల్పించుట. ఫాహియాన్ మొదలైన విదేశయాత్రికులు బౌద్ధమత ప్రభావమునకే ముగ్ధులై మన దేశమునకు వచ్చుటయు మెచ్చుటయు జరిగినది.

తక్షశిల, నాలంద, శ్రీ పర్వతవిహారాదులు మహోన్నత విశ్వవిద్యాలయములుగా ప్రసిద్ధికెక్కి నేటికిని మనకాదర్శప్రాయములై యున్నవి. విద్యాలయములకు నాటి రాజపోషణ యేనాటికైనను చిరస్మరణీయమే. ఆ పోషణలో అగ్రహారములు దేవాలయములు కూడ నృత్య చిత్రలేఖన సారస్వతాది కళాపీఠములై శిల్పకేంద్రములై నిలచిల్లినవి.

ఆ మహోత్తమ కళా విజృంభణము విదేశ సీమాంతముల వఱకు వ్యాపించి ఆ దేశములను నేటికిని మన యనుయాయులను గావించినది. భారతీయ పండితులా దేశములలో నఖండ విజ్ఞాన ప్రచార మొనర్చి పూజాపీఠముల నధిష్ఠించిరి.

అది ప్రాచీన భారత విజ్ఞాన చరిత్ర. ఒకనాఁడు దేశ దేశములకు విజ్ఞానభిక్ష నొసంగిన మన దేశ మీనాఁడు విదేశముల నుండి యదే భిక్షకై యంగలార్చుచున్నది. ఇది మన దౌర్భాగ్యము.

మన విద్యాపద్ధతి మారవలయునన్నచో, మన దేశము తిరిగి ప్రపంచములో విజ్ఞానాచార్యత్వము వహింపవలయు నన్నచో మన మొక్కసారి మన ప్రాచీన చరిత్ర నవలోకించుట యవసరము. భావి భాగ్యోదయ నిర్ణయము చేయవలసిన యుక్తసమయములో విద్యార్థులకీ ప్రాచీన విశ్వవిద్యాలయముల చరిత్ర నందించిన శ్రీ నమ్మాళ్వారుగారు కృతకృత్యులు. భవిష్యత్తులో నిట్టి వనేకములు వ్రాసి ప్రాచీన విజ్ఞాన చరిత్రను సహృదయుల కందజేయుదురు గాక !

రాజమహేంద్రవరము,
8—2—1951.

గ. శ్రీ. న. ఆచార్య.
ప్రధానాంధ్రోపన్యాసకులు
ప్రభుత్వ సర్వ కళాశాల.

# ప్రాచీన భారత విశ్వవిద్యాలయములు.



## వేద యుగము

"అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ"

"అసత్తు నుండి సత్తునకుఁ జీకటినుండి వెలుఁగునకు మృత్యువు నుండి యమృతత్వమునకునుఁ గొనిపొమ్ము" ఇది భారతీయ జిజ్ఞాసువు మానవ చరిత్ర యొక్క ప్రాగుషస్సుల లో నాలపించిన ప్రార్థనాగీతము. ప్రపంచ చరిత్రలోఁ దొలి సారస్వత సృష్టి వేదములు. ఋషులు మంత్రద్రష్టలై చరిత్ర కందని ప్రాక్తనకాలమున సుమసూక్తముల నాలపించిరి. వేదము లపౌరుషేయములు. ఈ యభిప్రాయము మూఢ విశ్వాసమని నవనాగరకులు కొందఱు తలపోయుచున్నారు. యథాతథరముగ, 'వేదము లపౌరుషేయములే — అవి శ్రుతులు'

అని విశ్వసించువారును గలరు. పోతన మహాకవి తన భాగవత రచనను గూర్చి

"పలికెడిది భాగవతమట
పలికించెడివాఁడు రామభద్రుండట, నేఁ
పలికిన భవహరమగునట
పలికెద వేరొండుగాథ బలుకఁగనేలా?"

యని ప్రశ్నించెను. మహాకవి పోతన తాను కేవలము నిమిత్తమాత్రుఁడని తలచెను. కవి తన కావ్యమునే యపౌరుషేయమని ప్రవచింప, వేదములను శ్రుతులని, వేదఋక్కులను మంత్రములనియు, తత్ప్రోక్తులైన ఋషులను మంత్రద్రష్టలనియుఁ జెప్పుటలో విప్రతిపత్తి లేదు. పోతన యనుభవ సిద్ధమైన విషయమును ప్రతిపాదించెను. ఈ యర్థములో క్రాంత దర్శులైన ఋషులు గాంచిన వేద మంత్రము లపౌరుషేయములే యని రసవ్యాఖ్యానముఁ జేసికొన వచ్చును.

"యస్తు విజ్ఞానవాన్ భవతి
యుక్తేన మనసా సదా
తస్యేంద్రియాణి వశ్యాని
సదశ్వా ఇవ సారథేః"

మనస్సును ధ్యాననిరూఢ మొనర్చుకొనిన జ్ఞాని సారథి యశ్వములను వలె నింద్రియములను తన వశము నందుంచు

కొనవలెను. ఇది కఠోపనిషత్ప్రబోధము. భారతీయ జిజ్ఞాసువునకు వేదములు తొలి ప్రాతిపదికలు. విద్య కాధ్యాత్మిక తత్త్వము మూలాధారము. అనుభవైకవేద్యమైన యీ సత్యమును గ్రహించుటకు జిజ్ఞాసువు యోగి కావలయును.

"తేజస్వినావధీతమస్తు"

యీ యాత్మ సంప్రార్థనముతో విద్యారంభమునకు భారతీయులు పూనుకొనిరి. విద్య తేజస్సు, ఆత్మవికాసము, భారతీయ జీవితాదర్శమును మహాకవి కాళిదాసు బాల్యమున విద్యాభ్యాసము, యౌవనమున విషయసుఖ పరాయణత్వము, వార్ధక్యమున మునివృత్తి యనియు నిర్వచించెను. జీవితమును భారతీయులు ధర్మార్థ కామమోక్షములను పురుషార్థములుగ ప్రస్తరించినారు. పురుషార్థనిర్వహణమే జీవితము; తత్సాధనయే విద్య. విద్యాసాధనమున కాత్మసంయమ మవసరము. ఈ మహాయోగము నందుకొనిన జిజ్ఞాసువు యోగి కాగలడు. చిత్తవృత్తి నిరోధమే యోగము.

మానవ జీవితములో ప్రథమాశ్రమము బ్రహ్మచర్యము. బ్రహ్మచర్య ముపనయనముతో నారంభించును. శిష్యుడు గురునిఁ జేరుట యుపనయనము. గురువు శిష్యునిఁ దన విజ్ఞాన గర్భకోశమునఁ బెంచి యతనికి నూత్న జీవితో

దయముఁ గల్గించును. అప్పు డాశిష్యుఁడు ద్విజుఁ డగును. అతఁడు బ్రహ్మచారి. గురుసాన్నిధ్యమున శుశ్రూషసల్పి శిష్యుఁడు విద్య నభ్యసించును. విద్యాభ్యాసము శ్రవణ, మనన, నిదిధ్యాసన యని మూఁడువిధములు. ముద్రాపక యంత్రములు గాని లిఖితపుస్తకములు గాని లేని, ప్రాక్తన కాలమునుండి యుగ యుగాంతరములు గడచి భారతీయ సారస్వతము నిలుచుటకుఁ గారణము గురుశిష్య పరంపరా గతమైన యీ శ్రవణ ధారణమే క్రీస్తుశక మెనిమిదవశతాబ్దినాటి కుమారిలభట్టు కాలము వఱకు శతాబ్దులతరబడి వేదములను లిఖితరూపమున నిల్పుట యపవిత్రముగనే భావింపఁబడుచుండెడిది. వేదములు నుపనిషత్తులు మంత్ర సూత్ర వాఙ్మయము భారతదేశమున గురుశిష్య ముఖ పరంపరాగతముగ నిలువఁగలిగినవి. ఋషులు, జ్ఞానులు, పండితులు భారతదేశమున జంగమ విద్యాలయములు, జీవత్పుస్తకములు. నాదము పరబ్రహ్మ స్వరూపము. జ్ఞానులు నాదబ్రహ్మోపాసకులు. గురుప్రోక్తములైన విషయముల నవగాహనఁ జేసికొనుటకు మనన మవసరము. జ్ఞాని మననశీలుఁడు. మననమునకు నిదిధ్యాసలేనిదే మనుగడలేదు. నిదిధ్యాసనమున శిష్యుఁడు గురుప్రబోధమును మనస్సాక్షాత్కారణము సల్పుకొనును. అవాఙ్మానసవేద్య మయిన విషయానుసంధానము నిదిధ్యాసనమున ననుభవగోచరమగును.

ముండకోపనిషత్తునందీ విషయమే మనోజ్ఞముగ బ్రిదర్శితము. జ్ఞానము వేఱు; అనుభూతి వేఱు జ్ఞానము దర్శనము. ద్వంద్వ బద్ధమై భిన్న నామరూపాదులచే వ్యగ్రమైన ప్రకృతిలో నంత ర్లీనమగు నైక్యతత్త్వమును జూడగలిగిన వాఁడే యోగి. జనక మహారాజు కొలువుకూటమున జరిగిన ప్రథమ ప్రపంచ వేదాంతిపరిషత్తులో యాజ్ఞవల్క్యుని యుషస్తుఁ డిట్లడిగెను: "ఎవ్వరైన అదుగో నది యెద్దు; అదుగో నది గుఱ్ఱము" అని చూపినచో నది ప్రత్యక్షనిదర్శనము అట్లే సర్వవస్తువుల యందు నిహితమైయున్న యాత్మ పదార్థ మేది? నాకు ప్రత్య క్షముగా జూపుము"

ఛాందోగ్యోపనిషత్తునందు నారదుఁడు సనత్కుమా రునిఁజేరిన సన్నివేశముఁబట్టి యలనాటి విద్యలు నాగరకత నూహించు కొనవచ్చును. నారదుఁడు తాను ఋగ్వేదము యజుర్వేదము, సామవేదము, నధర్వణవేదము,నితిహాసపురాణ ములు భూతవిద్య రాశీనిధిత ర్కైకాయన దేవనిరుక్త శిక్ష కల్పచ్ఛందో క్షత్ర నక్షత్రి నృత్యగీత వాద్యవిద్యల నభ్యసించి నట్లు జెప్పకొనెను. మఱియు "నేను మంత్ర వేదిని. కాని యాత్మ వేదినిగాదు; కావున నాత్మజ్ఞానము నుపదేశించి శోక తిమిరముల కవ్వలితీరమును నన్నుఁజేర్పుము" అని ప్రార్థిం చెను. సనత్కుమారుఁడు నారదుని శబ్దార్థజ్ఞానైక శీలుఁడని

సంబోధించును. పండెండేండ్లు వేదాభ్యాసముసల్పిన శ్వేత కేతుని దండ్రి యుద్దాలకఋషి యాత్మజ్ఞాన విరహితుఁడైన స్వాతిశయమూర్తిగా నెంచును. బృహదారణ్యకోపనిషత్తు 'జిజ్ఞాసువు పుస్తకజ్ఞానైక పరాయణుఁడు గాకూడదు; అది కేవలము కంఠశోషయే' యని ప్రవచించుచున్నది. విశ్వ యాత్మవికాసము. విశ్వకవి రవీంద్రుఁడీ విషయమునుగూర్చి చెప్పిన పలుకులు చిరస్మరణీయములు. "భారతీయ నాగిర కతకు ప్రాచీనకాలమున నరణ్యము లాలవాలములు. సరోవర ములు, నదీనదములు, వృక్షలతామండపములు— ప్రకృతిశోభ మధ్య ప్రాచీనభారతీయుని మనస్సు వికసించినది. ఆకాశము వలె నున్నతమై, విశాలమై, ప్రకృతినుండి భారతీయ నాగర కత వెల్లివిరిసినది. వేదబౌద్ధవాఙ్మయము లరణ్యములయందే యుద్భవించినవి. వేదఋషులు, బుద్ధభగవానుఁడు నారణ్యక వృక్షచ్ఛాయలలోనే తమ ప్రబోధముల వెలయించిరి. ఆర ణ్యకమైన యీ మహానాగరకతా ప్రవాహముయావద్భారత దేశమును వరదలతో ముంచెత్తినది. సంస్కృత సారస్వత మహానది పాలిప్రాకృతము మొదలగు నుపనదులతో నీనాగ రకతాప్రవాహమును ఋతువులను, దేశములను, యుగము లను నతిక్రమించి ప్రపంచమున కందించుచున్నది." ఈ మహాప్రవాహినీ తీరమునందు తీర్థభూతములైన నిలిచిన ఋషు లను స్మరించుకొనుట భారతీయుల పవిత్రకర్తవ్యము.

వేదకాలమున విద్యాలయము లరణ్యములు. సరోవర తీరములు నదీనదసైకతములు వటవృక్షచ్ఛాయలు విద్యా వేదికలైనవి. జిజ్ఞాసువులు జ్యోతిస్స్వరూపులైన ఋషుల చరణసమీపమున జ్ఞానోదయ మొందుచుండెడివారు. జ్ఞానార్థకమైన 'విద్' అను ధాతువునుండి పుట్టిన వేదశబ్దమునకుం జతుర్వేదములని మాత్రమే యర్థము చెప్పుట కూడదు. ఆరణ్యకములు, వేదాంగములు, నుపనిషత్తులు మున్నగునవన్నియు సమష్టిగ వేదశబ్దవాచ్యములు. జిజ్ఞాసువునకు వేదవేది యగుట పరమావధి. వేదములందలి మంత్రభాగములు యజ్ఞములందు ప్రాముఖ్యములు వహించును. బ్రాహ్మణములు, విధ్యర్థవాదరూపములుగనున్నవి ఆపస్తంభమహర్షి బ్రాహ్మణములు కొన్ని కర్మచోదనములనియు, మరికొన్ని యర్థవాదరూపములని ప్రవచించెను.

విధిరూపముననున్నవి తిరిగి ద్వివిధము. అప్రవర్తనములు — చేయరాని విధులను శాసించునవియును, నజ్ఞాతజ్ఞాపకములు — తెలియనివాని నుద్దీపింపజేయునవి. అర్థవాదములు విధుల ప్రాశస్త్యమును వివరించును. కావున వేదమున మంత్ర, విధి, యర్థవాదములు ప్రధానములు.

అరణ్యములలో నివసించు ఋషులు శిష్యులకు, సృష్టిస్థితి లయములనుగూర్చి, పరమార్థమునుగూర్చి చేసిన వేదాంతబోధన లారణ్యకములందు నిబద్ధమైయున్నవి. ఆత్మ, పర

మాత్మ, మృత్యువు, నమరత్వము మున్నగువానిని గూర్చిన చర్చ లీయారణ్యకములం గానవగును. వేదవాఙ్మయమునం బూర్వోక్తమైన యజ్ఞాజ్ఞాపనమును సిద్ధాంతీకరించునవి యుపనిషత్తులు, పరమాత్మనుగూర్చిన ప్రత్యక్షచర్య లిందు గానుపించును. బ్రాహ్మణములు గృహస్థులకు, నారణ్యములు వానప్రస్థులకు, నుపనిషత్తులు సన్యాసులకు నుద్దేశింపబడినవి. మానవజీవిత మార్గ సంప్రదాయానుగుణముగ బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమములు. జిజ్ఞాస యాం జన్మాంతము సాగవలసినదే.

శిక్ష కల్పము నిరుక్తము, ఛందస్సు, వ్యాకరణము, జ్యోతిషము వేదాంగములు. స్వరయుక్తముగ వేదముల నభ్యసించి యుచ్చరించుట శిక్ష. యజ్ఞములయందు ప్రయోగించుట కల్పము. అట్లే వేదార్థమును సమగ్రముగ నెరుగుటకు నిరుక్తము, ఛందస్సు, వ్యాకరణ మత్యవసరము జ్యోతిషము ప్రకృతితత్త్వ మెరుగుట కవశ్య పఠనీయము. అర్థ మెరుగక వేదమును వల్లివేయు కేవల పఠకుడు పరిమళము నాఘ్రాణింప శక్తిలేకయే చందన దారువులను మోయు గాడిద యని సంహితోపనిషద్ బ్రాహ్మణమునందు చెప్ప బడినది.

క్రీ. పూ. 700 సంవత్సరములకు ముందు, వేదములకు తొలి వ్యాఖ్యాత యాస్కుడు నిరుక్తమున ఋషులను

రెండువిధములుగ విభజించెను. 'మంత్రద్రష్టలు' — తొలి ఋషులు. తరువాత, వేదముల ననుశ్రుతముగ నుపదేశమంది యర్థమెరిగిన 'శ్రుతర్షులు.'

స్త్రీలు గూడ వేదకాలమున విద్యాభ్యాస మొనర్చి పేరొందిరి. వేద వేదిని యైన స్త్రీ బ్రహ్మవాదిని. ఋషిక, రోమశా, లోపాముద్రా, అపాలా, కద్రూ విశ్వావరా ఘోషా, జుహూ ఋషికలు, వేదవాఙ్మయమున సుప్రసిద్ధలు.

వేదవాఙ్మయమున పరిషత్తులు పేర్కొనదగినవి. యాజ్ఞవల్క్యుడు, మనువు రచనలనుండి యానాటి పరిషత్తులను గూర్చి తెలిసికొనవచ్చును. వేద వేదాంగ శాస్త్రవేత్తలయిన యిరువదియొక్క పండితుల సభ పరిషత్తు.

వేదవిద్యకు యోగము ముఖ్యము. ప్రత్యక్ష ప్రమాణమున కతీతమై యనుభవైక వేద్యములైన విషయముల నెరుగుటకు జిజ్ఞాసువు బ్రహ్మచారియై యోగి గావలెను. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము ధ్యానము సమాధి జిజ్ఞాసువు లక్షణములు. అట్టి శిక్షితచిత్తునకు సమ్యక్ జ్ఞానోదయము గల్గును.

చిత్రంవట తరూన్మూలే
వృద్ధాః శిష్యాః గురుర్యువా

గురోస్తు మౌనం వ్యాఖ్యానం
శిష్యాస్తు ఛిన్న సంశయః.

చిత్రము. మఱ్ఱిసీడను వృద్ధశిష్యులు యువక గురువు చేరినారు. గురువు మౌనముననే వ్యాఖ్యాన మొసర్చుచున్నాఁడు. శిష్యులకు సర్వసంశయచ్ఛేద మగుచున్నది. ఈ శ్లోకము వేదవిద్యాభ్యాసాదర్శమును మనోజ్ఞముగ నుపశ్లేషించినది.

## వేదవిద్యలతోపాటు లౌకిక వాఙ్మయ మభివృద్ధిజెందినది.

పాణిని సమకాలీన వాఙ్మయమునుగూర్చి అతనిరచన వలనఁ గొంతవరకుఁ తెలిసికొనవచ్చును. అతఁడు సారస్వతమును నాలుగు తరగతులుగ విభజించెను.

౧ దృష్టము—మంత్రద్రష్టలైన వేదఋషులు చెప్పిన ఋక్కులు. సామవేదము.

౨ ప్రోక్తము— అర్వాచీన ఋషులు చెప్పిన వేదఋక్కులు. ఆరణ్యకములు — ఉపనిషత్తులు — ఇందు పాణిని భిక్షుసూత్రములను, నటసూత్రములను జేర్చెను.

3 ఉపజ్ఞము—స్వీయప్రతిభచే ఋషులు చెప్పినవి. పాణిని, కాశకృష్ణ, ఆపిశలి మున్నగువారి రచన లుదాహరణప్రాయములు.

౪ ఇతర సారస్వతము—ఆఖ్యాయికలు మున్నగు కల్పనలు. అవి చారిత్రకములు గావచ్చును. కల్పితములు గా వచ్చును. ఆఖ్యాయికలు చారిత్రకములు. ఆఖ్యాయి కలు కల్పిత గాధలని పతంజలి నిర్వచనము. ఇతిహాస ములు పురాణములిందుచేరును. భారత రామాయ ణము లీ తెగకుఁ జేరును.

కౌటిల్యుని యర్థశాస్త్రమున సమకాలీన వాఙ్మయ విభాగము నాలుగు విధములు.

1. అన్వీక్షికి, 2. త్రయి, 3. వార్త, 4. దండనీతి.

అన్వీక్షికీవిద్యలో నాత్మ విచారజన్యమైన వేదాంత విషయములు చేరును. కౌటిల్యుఁడు సాంఖ్య యోగ లోకా యత తత్వముల నిందు చేర్చెను.

ఋగ్ సామ యజుర్వేదములు త్రయి, పశుశిక్ష, సేద్య ము మున్నగువానినిగూర్చిన ప్రబోధమువార్త, ప్రభుత్వ నిర్వ హణము దండనీతి.

కౌటిల్యుఁడు క్షత్రియ కుమారోచితమైన విద్యను విపు లముగా వర్ణించెను. అక్షరములను నేర్పుట (లిపి విద్య) లెక్కలను నేర్పుట (సంఖ్యావిద్య) తో విద్యారంభము.

క్షత్రియ కుమారుఁడు పదునారేండ్ల వరకు విద్య నభ్య సించిన తర్వాత వివాహము చేసికొనవలెను.

శిష్టులైన యుపాధ్యాయులవద్ద పూర్వోక్తములైన చతుర్విధవిద్యల నాతఁ డభ్యసింపవలెను. వివాహమయిన పిమ్మటఁగూడ నతఁడు విద్యనభ్యసింపవలెను. ఉదయమున రథ గజ తురగ పదాతి దళములను గూర్చిన శిక్షణపొందవలెను. మధ్యాహ్నమున నితిహాస పురాణ కాలక్షేపము సలుపవలెను. ఇతిహాసము పురాణేతి వృత్తములు, ఆఖ్యాయికలు, ఉదాహరణములు. ధర్మశాస్త్రములు, అర్థశాస్త్రములు నీ కాలక్షేపమునఁ గలిసియుండును.

వేద వేదాంగములతో పాటు వేదాంత తత్త్వములు బహుముఖముల విస్తరిల్లినవి. తర్కశాస్త్రము, వాదోపవాదములు భారతభూమిలో నధిరోహించిన యున్నత శిఖరములు ప్రపంచమున కద్భుతమును గొలుపుచున్నవి. ఈ వేదాంత గవేషణలో షడ్దర్శనములు ప్రాముఖ్యమును వహించి జిజ్ఞాసువుల కుపాదేయములైనవి. భారతదేశమునఁ జాల కాలమువరకు నీదర్శనజ్ఞానము విద్యావిధానమున నపరిహార్యముగఁ బరిగణింపబడెను.

ఇవి న్యాయవైశేషిక, సాంఖ్యయోగ మీమాంసా వేదాంతములు, భారతీయ వేదాంతతత్త్వములకు న్యాయదర్శనము పునాది. అందలి తర్కసిద్ధాంతములఁ దక్కిన దర్శనము లాద్యప్రకృతులుగ స్వీకరించినవి. వైశేషిక సిద్ధాంతమును

ప్రవచించిన ఋషి కాణాదుఁడు, సాంఖ్యశాస్త్రప్రోక్తమైన ఋషి క్రీస్తు పూర్వ మేడవశతాబ్దినాటి కపిలుఁడు. పతంజలి యాధ్యాత్మికజ్ఞానోదయమునకుఁ జిత్తవృత్తిశిక్షణ పూర్వకమైన యోగశాస్త్రమును బ్రతిపాదించెను.

ఉపనిషత్తులను వేదముల నాధారముగాఁ జేసికొని వేదాంతదర్శనము విస్తరిల్లినది. తరువాత శ్రీశంకర రామానుజ మధ్వ నింబార్కాచార్యులు మున్నగువారు వేదాంత దర్శనమున కర్థవివరణము సలిపి భిన్నమతములకాచార్యులైనారు. మీమాంస, పూర్వ మీమాంస, యుత్తర మీమాంస యని ద్వివిధము.

పూర్వ మీమాంసయందు కర్మకాండ కలదు. కర్మ మనగా వైదికకర్మకాండము. ఉత్తరమీమాంస జ్ఞానకాండ వేదోపనిషత్ ప్రోక్తమైన జ్ఞానగవేషణయందలి పరమార్థము.

పురాణకాలమున నరణ్యములే విశ్వవిద్యాలయములు. అందలి ఋష్యాశ్రమములే విద్యాలయములు. సంపూర్ణమైన యాశ్రమమునందు బహుశాఖ లుండెడివి.

1 అగ్నిస్థానము—ఆరాధనశాఖ. 2 బ్రహ్మస్థానము-వేదశాఖ, 3 విష్ణుస్థానము — అర్థనీతి, రాజనీతివార్తాశాఖ, 4 మహేంద్రస్థానము — సేవారక్షణశాఖ. 5 వివస్వతస్థానము-జ్యోతిషశాఖ, 6 సోమస్థానము—వృక్షశాఖ, 7 గరుడస్థానము-

వాహనప్రయాణ సౌకర్యసాధనశాఖ 8 కార్తికేయస్థానము—సేనావ్యూహ నిర్మాణశాఖ.

ఇట్టి యరణ్యాశ్రమములలో పేరొందినది నైమిశారణ్యమునందలి కులపతి శౌనకమహర్షి యాశ్రమము. పదివేల మంది శిష్యులకు నుచితభోజనవసతుల నొసగి విద్యగరపువాడు కులపతి. కులపతి శౌనకమహర్షి ద్వాదశవత్సరములు సత్రయాగ మొనరించెను. అచ్చటికి దేశ దేశములనుండి జిజ్ఞాసులు, పండితులు తరలివచ్చిరి. ఆ యరణ్య విశ్వవిద్యాలయముననే భారతము మహాభారతమైనది. ఆనాటి పండితులందరు పండ్రెండువత్సరము లొకచో చేరిరి. భారతజాతీయ విజ్ఞానసర్వస్వమైన మహాభారతము సూతఋషి కులపతి శౌనకునితోఁ జేరినవారికి వినిపించెను.

కణ్వాశ్రమమును మరియొక యుదాహరణముగ స్వీకరింపవచ్చును. కులపతి కణ్వుఁడు. ఎందరో వేదవేదాంగ వేత్తలు మహర్షుల కతఁడు సభాపతి. ఆ యాశ్రమ మొకఋషి వాటిక, విశ్వకళాపరిషత్తు. వ్యాకరణము శిక్ష ఛందస్సు నిరుక్తము, వేదములు బ్రహ్మోపాసన, యాత్మ విజ్ఞానము, దర్శనముల నభ్యసించువారి ందిరి. తార్కికులు, జ్యోతిష్కులు ద్రవ్యగుణవేత్తలు, జంతుశాస్త్రనిధులు మున్నగువా రచట నుండిరి.

వ్యాసాశ్రమమున సుమంత, వైశంపాయన జైమిని, పైల, శుకులు శిష్యులై వేదముల నభ్యసించి పంచభారతముల వ్రాసిరి.

యజ్ఞములు, దేశ దేశములందలి పండితుల నొకచో చేర్చుట కుపకరించుచుండెడివి. జనమేజయుడు సల్పిన సత్రయాగమున కరుదెంచిన విద్వాంసులు నైమిశారణ్యమున శౌనకమహర్షి సలిపిన సత్రయాగమున కరుదెంచిన పండితులను నుదాహరణముగ స్వీకరింపవచ్చును. జనకుని యశ్వమేధయాగసందర్భమున జరుగు వేదాంతచర్చలలోఁ బండితవాదోపవాదములలోఁ బాల్గొనుటకు దేశ దేశములనుండి విద్వాంసు లేతెంచినట్లు మహాభారతమునఁ గలదు.

ప్రయాగయందలి భరద్వాజఋషి యాశ్రమమున శతచతుశ్శాలలు, హర్మ్యములు, హస్తిప్రాసాదములు, రాజవేశ్మము లుండెడివి. దీనినిబట్టి యాశ్రమములు కేవల వేదాంత చర్చలను సల్పు పర్ణశాలలు గావనియు సమకాలీన విజ్ఞాన ప్రచారమొనర్చు విద్యాలయములని నిర్ణయింపవచ్చును.

అయోధ్య, కాశీ మున్నగుపట్టణములు ప్రాచీన కాలమున విద్యాకేంద్రములు. బుద్ధుడు తన తొలిప్రబోధము కాశీప్రాంతమందలి మృగదావము నందు సలిపెను.

అయోధ్య సూతమాగధ పౌరాణిక విద్యాకేంద్రము. ఆర్యచిత్రరథుఁ డట్టి పౌరాణికులలో గణనీయుడు. అయోధ్య

యందు వధూసంఘములు, నాటకసంఘము లుండెడివి. బ్రహ్మచారిసంఘము రాజును సందర్శించి తమ యభిప్రాయముల నెరిగించుచుండెడివారు.

ప్రాచీనభారతమున వృత్తివిద్యలు పారిశ్రామిక కళలు మిక్కిలి ప్రాముఖ్యము వహించినవి. ఆయుర్వేదము నభ్యసించు శిష్యునకు సుశ్రుతమను వైద్యగ్రంథమునం బ్రత్యేకముగ నొక యుపనయన మహోత్సవము జరుగవలెనని గలదు. మహోత్సవానంతరము గురు డగ్నిసాక్షిగా శిష్యునిచేం బ్రమాణము స్వీకరించును. శిష్యుడు కామ క్రోధ లోభ మద మాత్సర్యములను పాపకృత్యములను వీడవలెను. శుద్ధ పీతాంబరములను ధరింపవలెను. శిరోజ నఖ వర్జితుండై యుండవలెను. ద్విజ, గురు, దరిద్ర, మిత్ర, యతి, బృందముల కుచితవైద్యసేవ సలుపవలెను. కిరాత, పాపపతితులకు మందివ్వరాదు. శాస్త్రజ్ఞానము కర్మకౌశలము పక్షికి రెండు రెక్కలువలె వైద్యున కవసరము. అమృతము గూడ నసమర్థుడైన వైద్యునిచేతిలో విషముగ మారును. లఘుహస్తము, స్వయంకృతి, శస్త్రప్రయోగము సజ్జోపస్కరభేషజము వైద్యున కవసరలక్షణములుగాం జేర్కొనబడినవి.

కృషీవలులు, చిత్రకారులు, నటులు మున్నగువారు శ్రేణులుగా నేర్పడుచుండెడివారు. ఆ శ్రేణులలో నాయా వృత్తులకు సంబంధించిన విద్యలు గరపబడుచుండినట్లు గౌతమ

స్మృతిని బట్టి యూహింపవచ్చును. మానవజీవితములో నేపరి శ్రమమైనను కళయే. బ్రదుకు కళగాఁ జేసినవారు ప్రాచీన భారతీయులు. అదియే చతుష్షష్టి కళలకు మూలము.

హావభావాది సంయుక్తమైన నర్తన మొక కళ. రాజ తరంగిణి ముప్పదిరెండు విధములైన నర్తనమును వర్ణించుచున్నది. దాని కొక మహా శాస్త్రము కలదు. కావుననే భరతనాట్యమని భరతవిద్య యని పేరొందినది. వాత్స్యాయనుఁడు నేపథ్యయోగమును నాటకాఖ్యాయికా దర్శనమును నృత్యపరముగ నిర్వచించును. మొదటిది రంగ సంబంధి, రెండవది నాట్యసంబంధి.

కామసూత్రములు, కాదంబరి, శుక్రనీతిసార లలిత విస్తరములందు చతుష్షష్టికళల వివరణము గలదు. నాట్యముతో పాటు గానము ననేకవిధములు. సప్తస్వరగతము, వాద్యగతము, సమతలగతము.

సారథ్యమొక కళ. చిత్రలేఖనము మరియొక కళ. ధాతుసాంకర్యపార్థక్యకరణ మింకొక కళ, అనగాఁ గలిసి యున్న ఖనిజములను విడిగా వేరుపరచుట గూడ కళయే. తటాకవాపీ ప్రాసాదనిర్మాణము గూడ కళయే. యంత్ర ప్రయోగము, జలాగ్నివాయు సంరోధక్రియ, రసవాదము,

కాచపత్రాదికరణము, నానాదేశీయ వర్ణలేఖనము లీయరు వదినాల్గు కళలలోఁ జేరియున్నవి. జీవితమును బ్రస్తరించి, సమస్త మానవవ్యాపారమును కళలుగా బ్రాచీనులు విభజించి సాధించిరి.

శిల్ప మొక కళ. అమహాకళ కొక మహాశాస్త్రము. శిల్పవిద్య కుపాధ్యాయులు, విద్యాలయము లుండెడివి. పాషాణములకు జీవకళలు తీర్చిదిద్దిన భారతీయ శిల్పులు చిరస్మరణీయులు. పాషాణములు శిల్పులచేతిలో మైనపుముద్దలై జగన్మోహన రూపములను దాల్చి నిల్చినవి. శిల్పము రాతితోఁ గవిత చెప్పుట. భారతదేశమునం దెచ్చటచూచినను ప్రాచీన శిల్ప రేఖావిన్యాసములే సాక్షాత్కరించును. భారతశిల్పులు జగద్గురువులై ఖండఖండాంతరములలో ద్వీపదీపాలలోఁ బర్వతములలో గుహాలను విగ్రహాములను జెక్కిరి. పార్థము వద్ద దొరికిన నొక యక్షవిగ్రహాముస గల శాసనమున దానిని కునికుని యంతేవాసియైన గోమితకుఁడు చెక్కినట్లు గలదు. ఇంకొక శాసనమున కునికుని యంతేవాసి నాకుని పేరు కనిపించుచున్నది. దీనినిబట్టి శిల్పగురువులు వారికడ నంతేవాసులైన శిల్పశిష్యులు నుండెడివారని యూహింపవచ్చును. అమరావతి, నాగార్జునకొండ, ఎల్లోరా మున్నగు చోట్ల శిల్పములు ప్రధానముగ భారతీయ శిల్పచరిత్ర నుద్ఘోషించు

# ప్రాచీన భారత విశ్వ విద్యాలయములు.

---

## బౌద్ధ యుగము.

ప్రాచీనభారతదేశమున మతము, విద్య సాహిత్యము, శాస్త్ర విజ్ఞానము, శిల్పకళలు, మానవసమష్టి జీవితమున నల్లి బిల్లిగఁ బడుగు పేకగా నల్లుకొనిపోయినవి. ఆనాఁడు మతముతో సంబంధములేని విద్యనుగాని, విద్యతో సంబంధము లేని మతమునుగాని యూహించుట కష్టము. బౌద్ధమతప్రావిర్భావముతో భారతదేశమున నూత్నశక మారంభించినది. అనగా బౌద్ధమతము వేదోపనిషత్ ప్రోక్తమైన ప్రాచీన సంస్కృతి పరస్పర విరుద్ధములని యూహింపరాదు. బౌద్ధమతమునకును వేదమతమునకును భేదముకంటె సామ్యములే యెక్కువగా గోచరించును. మాక్సు ముల్లరుపండితుని ప్రవచనము లీసందర్భమునస్మర్తవ్యములు. "వేదోపనిషత్ ప్రోక్తమైన ప్రాచీనభారతమతము ననుశీలించిన పిమ్మట బౌద్ధమత మొక వినూత్నతత్వముగఁ బొడకట్టదు. బౌద్ధము వేద యుగానంతరము

భారతీయ మానసిక క్రమపరిణామ వికాసముగ గోచరించును.” బార్తు పండితుఁడు “బౌద్ధమతము వేదోపనిషత్ ప్రోక్తమైన హైందవ మతములో సంస్కారమే” అని వ్రాసెను. ఓల్డెనుబర్గు పండితుఁడు “బుద్ధునకుఁబూర్వమే శతాబ్దులనుండి బౌద్ధమత భావములు పరిణతి నొందుచున్నవి” అని వ్రాసెను.

ఆత్మ, దుఃఖము, మోక్షము, కర్మ, పునర్జన్మ, బ్రహ్మచర్యము, సన్యాస, భిక్షుకసంఘములు-ఇవియన్నియు బుద్ధుడు క్రొత్తగా ప్రతిపాదించినవిగావు. వేదయుగము నుండి భారతీయులకు సుపరిచిత భావములే. “అహింసా పరమో ధర్మః” అను బౌద్ధమతప్రధానసిద్ధాంత ముపనిషదుక్తియే, కాని బుద్ధుఁడు సమకాలీనసంఘములో ననర్థవిపరిణామములకు దారితీసిన సిద్ధాంతములఁ బ్రతిఘటించి నిల్చెను. “యజ్ఞవాటికలలోజరుగు జీవహింస, వృథాధనవ్యయము నిష్ప్రయోజనములు, వానిని నిరసింపుడు, వేదము లపౌరుషేయములు కావు, ఇతర గ్రంథములవలెనే వానిని జూడ వచ్చును.

అరణ్యములలోఁ గఠినతపస్సు, శరీరకష్టము ప్రయోజనరహితములు అయినచో వానిని పీడితొలగిపోవచ్చును.

వైరాగ్యమే మహాపుణ్యమై, దుఃఖభాజనమైన ప్రపంచమునుండి విముక్తి కల్గించుచో సకలజనులు విరాగులై భిక్షుకులై సంఘములోఁజేరి తరింపుడు.

ఈ ప్రబోధము సకలప్రాణికోటిని దయాస్వభావముతోఁ బరికింపవలెనను విశ్వప్రేమ జ్యోతిర్మూర్తియై బుద్ధుడు భారతావనికి, మానవజగత్తునకుఁ బ్రసాదించెను. మానవచరిత్రకు బుద్ధభగవానుని ప్రబోధము మహోదయము. అంతఃప్రేరణతో భారతీయులు "సంఘం శరణం గచ్ఛామి" "ధర్మం శరణం గచ్ఛామి—బుద్ధం శరణం గచ్ఛామి" అను నినాదములతో నాత్మాంకిత మొనర్చుకొనిరి. ఒకనాటి యర్ధరాత్రి రాజాంతఃపురమును, నవ్యలావణ్యలహరి భార్య యశోధరను, పూరిటింటిలోనున్న కసికందు రాహులుని వీడి త్యాగవేషణ కొఱకై నిర్వాణపథము నరయుటకు బుద్ధుడు బయలు దేరెను. ప్రపంచ చరిత్రలో మరు వ్వడోనరించిన యాత్రలో బుద్ధునియాత్ర యగ్రగణ్యము. అది మహాభి నిష్క్రమణమై మానవ హృదయములలో విశ్వచరిత్రలో చిరస్థాయిగ నిల్చి యున్నది. అశ్లే బుద్ధుని మార్గదర్శిగ స్వీకరించి భారతీయులు భిక్షుకులై గృహములనువీడి బౌద్ధమతే ప్రచార మొనర్చిరి. ఒకనాడు బుద్ధుని ప్రబోధము చక్రవర్తి యశోకు నాకర్షించినది. ఖండఖండాంతరముల ద్వీపద్వీపకల్పములలో బుద్ధభగవానుని దివ్య ప్రబోధముతోపాటు శతాబ్దులతరబడి భారతీయపండితుల శాస్త్రవైదుష్యము, తర్కవిజ్ఞానము, సంస్కృతసాహిత్యము పాశ్చాత్యప్రపంచమంతటను నలుముకొన్నవి.

బుద్ధుఁడు బ్రాహ్మణపండితులయెడ నత్యంతగౌరవము చూపెడివాఁడు. బ్రాహ్మణులఁ బరివాస మక్కరలేకుండగనే యొకానొకని భిక్షుకసంఘమునఁ జేర్చెడివాఁడు. అశోకుఁడు తన ధర్మశాసనములలో భిక్షుకులకు గాక బ్రాహ్మణులకుఁ గూడ విశేషగౌరవము చూపవలెనని పలుమారు విధించి యున్నాఁడు. ఈ సందర్భమున 'రైస్ డేవిడ్స్' పలుకులు పరిశీలనార్హములు. గౌతమబుద్ధుఁడు హిందువుగపుట్టి హిందువుగఁ బెరిగి, హిందువుగ మరణించెను. సమకాలీను లతని హిందువుగనే పరిగణించిరి. అతని పూర్వకులైన మునుల మతతత్త్వవిచారణములే లేనియెడల బౌద్ధసిద్ధాంతము లుద్భవించి పెంపొందెడివి కావు. బుద్ధుఁడు హిందువులలో నత్కృష్టుఁడు, మహానుభావుఁడు, మహాశయుఁడు.

అద్యతన చరిత్రకారులలోఁ గొందఱు బుద్ధుని సంఘసంస్కారిగ వర్ణవిభేదద్వేషిగఁ జిత్రించుచున్నారు. బుద్ధుని యాత్మీయతానుశీలనమున కది ద్రోహముకానిచో, నసత్యకల్పనమనక తప్పదు. బుద్ధున కార్థికకులవిభేదములతోఁ బ్రసక్తి లేదు. అతఁడు మానవునే యుద్ధరింపఁ దలపోసెను. దుఃఖభాజనమైన లౌకిక జీవితమే త్యాజ్యము. ఆధ్యాత్మవైరాగ్యజీవిత గవేషణమే పరమార్థము.

ప్రవ్రజ్యాశ్రమ స్వీకార మొనరించినచో బౌద్ధసంఘమునఁ జేరవచ్చును. ఇరువదియేండ్ల లోపుగనున్న యువకుఁడు

ముండిత శిరస్కుఁడై కాషాయ వస్త్రముల హస్తముల నిడు కొని విహారమును జేరును. అతని కొకవృద్ధభిక్షువు పరివ్రాజిక దీక్ష నొసగును అప్పు డాతడు కాషాయాంబరముల ధరించి విహారమును జేరును. అతడు విహారమున భిక్షుకమండలిని జేరుటకు ముందు శరణత్రియదీక్ష గై కొనవలెను "బుద్ధం శరణం గచ్ఛామి—సంఘం శరణం గచ్ఛామి. ధర్మం శరణం గచ్ఛామి" — తరువాత బ్రహ్మచారియై "దశ" శిక్షాపథముల ననుసరింపవలెను.

౧. జీవహింస సలుపరాదు.
౨. అదత్తాపహరణము కూడదు.
౩. అపవిత్రకృత్యములు సలుపరాదు.
౪. అసత్య మాడరాదు.
౫. మద్యపానము కూడదు.
౬. అకాలభోజనము సలుపరాదు.
౭. నృత్యగాన వినోదప్రదర్శనముల కేగరాదు.
౮. గంధమాల్య సుకుమారాంబరములు వాడరాదు.
౯. ఉన్నతాసన వాహనములుపయోగింపరాదు.
౧౦. బంగారు వెండి యుపయోగింపరాదు.

బుద్ధుఁడు సవతితల్లియైన మహాప్రజాపతి, శిష్యుఁడైన యానందుని పట్టుచే స్త్రీలకు గూడ దీక్ష నొసగుటకు సమ్మ

తించెను. బౌద్ధభిక్షుకులు భిక్షావృత్తిచే జీవింపవలెను. భిక్షాపాత్రి యయఃపాత్రిముగాని మృత్పాత్రిముగాని కావచ్చును.

బౌద్ధభిక్షువు లిట్టి కఠోర నియమబద్ధులై విహారారామములందు పవిత్రజీవితమును శతాబ్దుల తరబడి గడిపిరి. భారతదేశమునందంటను నిట్టి విహారములుండెడివి. ఇందు కొన్ని చరిత్రలో సుప్రసిద్ధములు. జేతవనవిహారము ననంతపిండికుఁడు నిర్మించెను. ఈ విహారమును గూర్చి చిత్రమైన గాథ యొకటి కలదు. ఈ విహారముగల యారామము జేతుఁడను రాజపుత్రునిది. బుద్ధుడు విహారము పట్టణమునకు సమీపమున, ప్రజలకు లౌకికవ్యాపారములకు దూరముగ, రాకపోకలకు వీలుగ, భిక్షునివాసమునకు సదుపాయములు గలిగి విశాలముగ నుండవలెనని నిర్దేశించెను. అనంతపిండికుఁడట్టిది జేతవనమని నిశ్చయించి, రాజపుత్రుడైన జేతు నడిగెను. జేతరాజకుమారుడు "ఆరామమునంతటిని బంగరు నాణెములతోఁ గప్పినగాని పిక్రయింపన"ని బదులు చెప్పెను. అంతుల కనంతపిండికుఁడు సమ్మతించి, తన సర్వస్వమును వెచ్చించి యా రామ భూమిని బంగారునాణెములతోఁ గప్ప సాగెను. నాణెముల నన్నిటిని పరుచునప్పు డారామ ద్వారము మాత్రము మిగిలిపోయెను. అప్పుడు రాజకుమారుఁ డనంతపిండికుని యీవికి నచ్చెరువంది యాభూమిని తన దానముగా స్వీకరింప ప్రార్థించెను. రాజకుమారుఁడు భిక్షుసంఘమున

జేరుటకు సంతోషించి యనంతపిండికుఁడు దానికి సమ్మతిం చెను. జేతరాజపుత్రుండు ద్వారమున నొక హర్మ్యమును గట్టించెను. అనంతపిండికుఁడు భిక్షువుల యావాసమునకు విహారావాసముల నన్నిటి నిర్మించెను. యష్టివన, వేణువన, సీతవన, మహావన, జూతవన విహారములు బుద్ధుని కాలము నుండి సుప్రసిద్ధములు. విహారములలో విద్యాభ్యాసము శాస్త్రచర్యలతోపాటు వ్యాయామము గజాశ్వరథ క్రీడలు వినోదద్యూతక్రీడ భిక్షువుల దినచర్యలో నుండెడివి.

బౌద్ధభిక్షువులు దేశభాషల నభివృద్ధికి మిక్కిలితోడ్ప డిరి. ప్రజలకుఁ బ్రజలభాషలోఁ దత్త్వప్రబోధము సలుపుటకు మహోద్యమము నారంభించి జయప్రదముగ నిర్వహించినది బౌద్ధభిక్షుకులే. వినయసూత్రములు, తత్త్వప్రబోధములు గురుశిష్యముఖపరంపరాగతముగ విహారములలో వెలసెడివి. చాలకాలమువఱకు గ్రంథములుగాని, రచనగాని యున్న ట్లగుపించదు. కొంతకాలమునకు గ్రంథములు వ్రాతప్రతు లను వ్రాయుట విహారభిక్షుకుల ముఖ్యకర్తవ్యములుగా మారినను, విద్య, గురు శిష్య కంఠస్థమై వెలయుట మాన లేదు. విద్యాభ్యాసమున, చర్చలు, ఖండనమండనలు, వాద ప్రతివాదములు మిక్కిలి ప్రాముఖ్యమును వహించినవి.

క్రీస్తుశకము 400 సంవత్సరప్రాంతమున మైత్రేయుఁడు "సప్తదశ భూమిశాస్త్రయోగాచార్యము"ను గ్రంథమును

వ్రాసెను. అది క్రీ. శ. 646 లోఁ జీనాభాషలోని కనువదింపబడెను. అందు చర్చనుగూర్చి విపుల వివరణము గలదు. చర్చలో విషయవివరణమున కాతడష్ట సూత్రములను బేర్కొనెను. 1 సిద్ధాంతము, 2 హేతువు, 3 ఉదాహరణము, 4 సాధర్మ్యము, 5 వైధర్మ్యము, 6 ప్రత్యక్షప్రమాణము, 7 అనుమాన ప్రమాణము, 8 ఆగమనిర్వచనము.

బౌద్ధభిక్షుకులు త్రిపిటకములను వినయ సూత్రములను గంఠస్థమొనర్చెడివారు.

బుద్ధునితర్వాతి శతాబ్దులలో నీసంఘారామము లెట్లు విలసిల్లినవో చెప్పుచారిత్రక గ్రంథములు లేవు. కాని చీనా దేశమునుండి బౌద్ధధర్మ జిజ్ఞాసువులై క్రీస్తుశక మొదవ శతాబ్దిలో పాహియాన్, ఏడవ శతాబ్దిలో యువాంగ్ చాంగ్—ఇట్సింగ్ యాత్రికులు భారతదేశమున కేగుదెంచిరి. వారిరచనలవలన, నాటి భారతీయ బౌద్ధనాగరకత, సంస్కృత సాహిత్యము, శాస్త్రవిజ్ఞానము, విద్యా ప్రచారము మున్నగు విషయములు తెలియుచున్నవి. ఆరచనలకుగల విలువను నతిశయోక్తిగాఁ జెప్పుటకు వీలులేదు. చీనాయాత్రికులు భారతభూమినిగూర్చి విని యంతఃప్రేరణతో తీర్థయాత్రికులై విజ్ఞానజిజ్ఞాసువులై, మార్గమధ్యమునఁ బ్రాణత్యాగ మొనర్చుటకు వెనుదీయక తరలివచ్చిరి. వచ్చినతరువాత వారాశాభంగ మొందలేదు. భారతభూమిలో విజ్ఞాననిష్ణాతులై స్వదే

శమున కేగిన కేర్వాత నఖండగౌరవ పూజామర్యాదల నంది చరిత్రలోఁ జిరస్థాయిగ నిల్చిరి. ఆనాడు భారతభూమి, భారత దేశమంగలి విహారములు ప్రాచ్యప్రపంచములోని చీనా, జపాను, సువర్ణద్వీపము, చంపా, శ్రీవిజయ, యన సుమిత్రా బోర్నియో ద్వీపసముదాయము మున్నగు దేశములలోని విజ్ఞాన జిజ్ఞాసువులకుఁ బవిత్ర తీర్థయాత్రాస్థలములు. అట్లు భారత దేశమునకు వచ్చిన యసంఖ్యాక విజ్ఞాన తైర్థికులలోఁ జరిత్రలో స్థిరకీర్తినందుకొన్న వారు చీనా యాత్రికులు పాహియాన్, యువాన్‌చాంగ్, ఇట్సింగులు. బుద్ధభగవానుని జన్మభూమిని దర్శించి పాహియాన్ పులకాంకితుఁ డయ్యెను. "ఆ తేజోమూర్తి పూర్వకాలమున నిచ్చోటనే యవతరించి, సురంగమసూత్రముల బోధించినాడు. అదృష్ణ హీనుఁడనగు నే నీకాలమున జన్మించి యాలోకకల్యాణజన్మునిజూచు భాగ్యమునకు నోచుకొననైతిని. అతఁడు పావన మొనర్చిన పుణ్యభూముల మాత్రమైనను గాంచగల్గితిని. నాజన్మ తరించిన దని సంతోషించెను.

## పా హి యా న్

పాహియాన్ చీనా దేశమున 'ఉయాంగ్' నగరమున క్రీస్తుశకము 370 సంవత్సరప్రాంతమున జన్మించెను. అతఁడు

షాంగన్ నగరమునం బెరిగెను. ఇతఁడు తలిదండ్రులకు నాల్గవ తనయుఁడు. మొదటి ముగ్గురు నకాలమృత్యుముఖమునఁ బడుటచే తండ్రి యాతనిని బ్రతికియున్న చాలునని, మూఁడేండ్ల పసిప్రాయముననే యొక బౌద్ధమఠమున విడిచిపెట్టెను. కాని కన్నతీపిచే నాతని నెడబాయజాలక యింటికిఁ దీసికొని వచ్చుటతోడనే పిల్లవాడు రోగగ్రస్తుఁడయ్యెను. మందులు నిష్ప్రయోజనము లైనవి. తండ్రి కన్నీరు గార్చుచు నితని తిరిగి బౌద్ధమఠమున విడిచిపెట్టెను. అప్పుడాతఁడు తిరిగి కోలుకొనెను. ఫాహియాన్ ఆబాల్యసన్యాసి యయ్యెను. అతనిని పదవయేట తండ్రి మరణింప తల్లి నిరాధారయైనది. మేనమామ యెంతబ్రతిమాలుకొనినను వినక ఫాహియాన్ సన్యాసదీక్షతోడనే జీవితము గడపుటకు నిశ్చయించుకొనెను.

క్రీస్తుశకము 399 వ సంవత్సరమున నిరువదియైదేండ్ల ప్రాయమున వినయపీఠిక మున్నగు బౌద్ధగ్రంథములను దెచ్చుటకు, బుద్ధభగవానుని పవిత్రజన్మభూమిని దర్శించుటకు, హ్యుయింగ్, హ్యుష్లై, హ్యుకింగ్, టోచింగ్ మిత్రులతో గలిసి ఫాహియాన్ భారతదేశయాత్ర కుపక్రమించెను. వారు మార్గమధ్యమున భారతదేశమునకుఁ బయనించుచున్న చేయన్, యూకిన్‌సాంగ్‌షో, పోయన్, సాంకింగు చీనీయులను గలిసికొనిరి. ఇందు 'పోయన్' చీనాకు మరలిపోయిన తర్వాత ననేక సంస్కృతగ్రంథములు చీనాభాషలోని కను

వదించి పేరుకెక్కెను. టన్హ్వాంగుపట్టణమును జేరి యచ్చట నొకమాసముండి పాహియాన్ తనమిత్రులతో భారతయాత్ర సాగించెను. పోయన్ ప్రభృతులు వేరొకమార్గమును బట్టిరి.

ఆకాలమున నంతటి దూరప్రయాణము చేయుట మిగుల దుస్సాధ్యముగ నుండెను. పాహియాన్ ప్రభృతులు మార్గమధ్యమున మిక్కిలి శ్రమనందిరి. నిర్మానుష్యమై భీకర వాయువిక్షేపముల కాకరమై, దుర్గమమగు గోబీయెడారిని దాటిరి. వడవడ వణకించు శీతలవాయునిలయమగు హిమాలయపర్వత శ్రేణులనధిగమించిరి. పర్వతశిఖరములనుండి యతి వేగముగా స్రవించు మహానదులను దాటిరి. క్రూరమృగావృతమైన భీకరారణ్యముల నధిగమించిరి. మార్గమున షెన్ సెన్, కుస్తాన్, కీచా రాజ్యములను దాటిరి. చైనాసామ్రాజ్యమునుండి భారతదేశము చేరువఱకు వారు చూచిన దేశములన్నియు భారతీయ విజ్ఞానసామ్రాజ్యౌన్నత్యమునకు దోసిలొగ్గినవే. అన్నిటియందును ఆర్యావర్త విజ్ఞాన దిగ్విజయ పతాక మప్రతిహతమై యెగురుచుండెను. ప్రాచ్యప్రపంచమంతయు భారతీయాధ్యాత్మికసామ్రాజ్యమున కధినివేశ రాజ్యములైనవి. ఈరాజ్యములన్నిటికి వేష భాషామర్యాదల యందు, విజ్ఞానవ్యవహారములందు, శిల్ప చిత్రకళాసాహిత్య శాస్త్రములందు భారతదేశము ఒజ్జబంతియై యుండెను. ఆర్యావర్తమునకుఁ బశ్చిమోత్తరముననున్న లోయా (ప్రస్త

శము - ఆఫ్ఘనుస్థానము) ఓహాన (బెలూచిస్థానము) రాజ్యమునుండి తూర్పున కామరూపము (అస్సాము) వరకు బౌద్ధమత మానాడు ప్రబలియుండెను. ఇట్లారు సంవత్సరములు ప్రయాణమొనర్చి పాహియాన్ భారతభూమిని జేరుకొనెను. పశ్చిమోత్తరమున “ఉద్యాన” రాజ్యమున హీనయాన శాఖకుఁజెందిన యైదువందల బౌద్ధసంఘారామములను జేర్కొనెను. పెటూా (పంజాబు) లో హీనయానమహాయానబౌద్ధ సంఘారామములను జేర్కొనెను. అచ్చటనుండి దక్షిణోన్ముఖుఁడై ప్రయాణమునర్చి యసంఖ్యాకముగ సంఘారామములనుగూర్చి వ్రాసెను. అచ్చటినుండి మధురను జేరెను. యమునానది కిరుతటముల 3000 భిక్షుకులుగల నిరువది సంఘారామములను జేర్కొనెను అచ్చటిప్రజలు, రాజులు బౌద్ధధర్మమును శిరసావహించినవారే.

పాహియాన్ స్వయముగ సందర్శించిన సంఘారామము లనేకములు. అచ్చటి స్థూపములు, యాత్రికులై తెరపి లేకుండ వచ్చుజనులు, పుష్పములను జల్లుచు దీపారాధనము చేయువారి సుకజల్లిన రాలకుండ నుండిరని వ్రాసినాడు.

ప్రాచ్యజగత్తునఁ ప్రాచీన భారతీయ విశ్వకళాపరిషత్తుగఁ జరిత్రలో స్థిరకీర్తి నార్జించిన తక్షశిలను పాహియాన్ సందర్శించెను. గాని యచ్చటి సంఘారామములను గూర్చి వ్రాయలేదు. పురుషపురమందు 700 భిక్షుకులుగల విహార

ముండెడిది. బుద్ధ ధాతునిక్షిప్తమగు స్థూపచతుష్టయము లీ ప్రాంతమున గలవు. స్థూపనిర్మాణము నందలి శిల్పవిద్య భారతీయమే. నాగారాయందిట్టి స్థూపమొకటి కలదు. అందు 700 భిక్షుకులు గలరు పాహియాన్ వెంట నరుదెంచిన హుయింగ్ రోగపీడితుఁడై యచ్చటనే మరణించెను. సంకాశ్యవిహారమున వేయిమంది భిక్షుకులు హీనయాన మహాయాన సిద్ధాంతముల నభ్యసించి ప్రబోధము సల్పు చుండిరి. గంగాతీరముననున్న కన్యాకుబ్జమున భిక్షుకులు హీనయానము నభ్యసించెడివారు.

శావస్తీనగరమున జేతవనవిహారము కలదు. ఇది మొదట నేడంతస్తుల హర్మ్యము. ఇందు బుద్ధుఁడిరువదియైదు సంవత్సరము లుండెను. పాహియాన్ జేతవనవిహారమును సందర్శించెను. అచ్చటి భిక్షుకులు దూరదేశమైన చీనానుండి వచ్చిన పాహియానును గాంచి యాశ్చర్యమొంది స్వాగత మిచ్చిరి. జేతవనవిహారమున భిక్షుకులుగాని గురువులుగాని చీనా దేశమునుండి వచ్చిన యేభిక్షుకుని నంతకుముందెప్పుడు గాంచియుండలేదు. ఆ విహారము భారతదేశములో వన్నె కెక్కిన బౌద్ధవిద్యాకేంద్రము. బుద్ధునికాలమునుండి పాహియాన్ కాలమువరకు సుమారు సహస్రవత్సరము లాజేతవన విహారము బౌద్ధవిద్యాలయముగ నిలచియుండుట గణనీయము.

బుద్ధుడు నిర్యాణమొందిన తావు కుశనగరమందనేక సంఘారామములను పాహియాన్ సందర్శించెను.

వైశాలీనగరమున బుద్ధునికాలముననే అంబపాలి యను వేశ్యనిర్మించిన విహారము, తొల్లిటి శోభ దరుగక నిలిచి యుండుటనుగాంచి ధన్యుడయ్యెను.

పాహియాన్ కాలమున భారతదేశమున బౌద్ధవిద్యా నిలయముగఁ బేర్కొనవలసినది పాటలీపుత్రసంఘారామము. అచ్చట పాహియాన్, మౌర్య రాజప్రాసాదమును మండపములను పూర్వదీప్తి తరుగక నిలిచియున్నట్లు వర్ణించెను అచ్చట హీనయాన మహాయాన సంఘారామములు రెండున్నవి. రెంటిలో మొత్తము 700 భిక్షుకులుండిరి. ఆ సంఘారామములు దివ్యహార్మ్యవిలసితములు. బౌద్ధపండితులు, పేరు మోసిన విద్వాంసు లచటనివసించెడివారు. బౌద్ధతత్త్వగవేషణార్థమై యావత్ భారతమునుండి జిజ్ఞాసువు లచ్చటి కేగుచుండెడివారు. అచ్చట రాధాస్వామిపండితుడు రాజగురువు. అతనిని ప్రజలు రాజు మిక్కిలి గౌరవించెడివారు. పాహియాన్ పేర్కొనిన మరియొక సుప్రసిద్ధపండితుడు మంజు శ్రీ, మహాయాన భిక్షుకు లందరి కతఁడాారాధ్యుడు.

రాజగృహమునందు జీవకుడను వైద్యుడు బుద్ధునకు శిష్యులు 1250 మందికి కట్టించిన విహారమును సందర్శించి

నట్లు వ్రాసెను. అచ్చట బింబిసారచక్రవర్తి బుద్ధునకొసగిన వేణువనమును, భిక్షుకులు కొందరు తుడిచి నీళ్ళు జల్లి పరిశుభ్ర మొనర్చుట గాంచెను.

బుద్ధునకు జ్ఞానోదయమైన గయను సందర్శించి మహాబోధివృక్షమును గాంచెను. అచ్చట మూడు విహారములు గలవు. అందలి భిక్షుకుల క్రమశిక్షణ, పాండిత్యమును పాహియాన్ ప్రశంసించెను. బుద్ధునికాలమునుండి యీసంప్రదాయములట్లే పరంపరాగతముగ నిల్చినవి.

అతడు వారణాసిని సందర్శించి, బుద్ధుడు మొదటి ప్రబోధమునసల్పిన మృగదావమును నచ్చటి మూడుసంఘారామములను భిక్షుకులను గాంచెను. కౌశాంబివద్ద, బుద్ధుని కాలమున నిర్మింపబడిన విహారములను నచ్చట నివసించు భిక్షుకులను సందర్శించెను. వారుహీనయాన మతావలంబులు. భారతదేశమున పాహియాన్ సందర్శించిన చిట్టచివరిస్థలము తామ్రలిప్తి. ఇరువదిరెండు విహారము లచ్చటగలవు. అందు భిక్షుకులు నివసించుచుండిరి.

ఈవిహారము లన్నిటియందు వినయసూత్రములు పరిపాలింపబడెడివి.

పాహియాన్ వినయపీఠికల బౌద్ధసూత్రముల వ్రాతప్రతులను భారతదేశమునుండి గొనిపోదలచెను. కాని యీ

విహారము లందెచ్చటను వ్రాతప్రతులులేవు. అన్ని విహారము లందును బౌద్ధవిజ్ఞానము కంఠస్థమై గురుశిష్యముఖముల వర్థిల్లెను. ఆనాడు బౌద్ధపండితభిక్షుకులు జంగమమూర్తిమద్విజ్ఞానగ్రంథములు. అతనికి వ్రాతప్రతులు పాటలీపుత్ర మహాయాన విహారమునందు తామ్రలిప్తి విహారములలో మాత్రమే లభించెను. అతఁడు పాటలీపుత్రమునందు సంస్కృతము నభ్యసించుచు మూఁడుసంవత్సరములు గడపెను. ఫాహియాన్ చీనాకు వ్రాతప్రతులుగా కొన్ని బౌద్ధగ్రంథములను దీసికొనిపోయెను.

1. బుద్ధుని కాలమున ప్రయుక్తమైన మహాసాంఘిక నియమములుగల వినయపీఠిక.

2. ఆరు లేదా యేడు వేలగాథలుగల సర్వాప్తివాద సూత్రములు.

3. సంయుక్తాభిధర్మహృదయశాస్త్రము— 6000 లేక 7000 గాథలు.

4. 2500 గాథలుగల సూత్రము.

5. పారినిర్వాణవైపుల్య శాస్త్రము—ఒక అధ్యాయము.

6. మహాసాంఘిక అభిధర్మము.

తామ్రలిప్తినుండి వ్రాతప్రతులను దీసికొని, సముద్రమార్గమున ఫాహియాన్ చీనా దేశమునకు బయలుదేరెను.

అతని మిత్రుఁడు టోచింగ్, "బుద్ధభగవానుని పవిత్రజన్మ భూమిని చూచిన నేనింక పెర భూములఁద్రొక్కను. బుద్ధత్వ మువలకిచటనే యుండెదన"ని భారతదేశముననే నిలిచి పోయెను. పాహియానుకు భారతభూమిపై బౌద్ధధర్మముపై నెంతగౌరవమో మాతృభూమియైన చీనాదేశముపై నంత ప్రేమ. అతఁడు చీనాదేశములో బౌద్ధధర్మగ్రంథములు లేని కొరతదీర్చి, తనతోపాటు స్వదేశీయులఁగూడ నుద్ధరింపఁ బూనుకొనెను. అందుచే నతఁడు తామ్రలిప్తినుండి యోడ లో బయలుదేరి సింహళమును జేరెను. సింహళమున గూడ బౌద్ధమతము భారతీయశిల్పము పాదుకొనియుండెను. పాహి యాను సింహళము చేరినప్పుడచ్చట కొక భారతీయపండి తుఁడే తెంచి బౌద్ధధర్మములగూర్చి యుపన్యసించి పలువురకు బౌద్ధదీక్ష నిచ్చెను. సింహళి బౌద్ధసంఘారామములలో సం స్కృతపండితు లనేకులుగలరు. పాహియాన్ సింహళమున రెండుసంవత్సరము లుండెను. అచ్చట, వినయపీఠిక దీర్ఘా గమ సంయుక్తాగమ సూత్రములు, సంయుక్తసాంఖ్యపీఠిక మున్నగు నపూర్వసంస్కృత గ్రంథము లితని కిచ్చట లభిం చినవి.

అతఁడు సింహళమునుండి యొక వర్తకనౌకలోఁ జీనాకుఁ బయనమయ్యెను. సముద్రమధ్యమునఁ బెద్దతుపాను

చెలరేగెను. వణిజులు తమసరకులను నడిసముద్రములోఁ బడ వేసిరి. నావకు రంధ్రమేర్పడెను. పదిమూడహోరాత్రము లా ప్రాణాపాయదశలోనుండి చివరకు యవద్వీపమును చేర గల్గిరి. అచ్చట బౌద్ధమతము క్షీణదశయందున్నది. అచ్చట నైదుమాసములు ఫాహియాన్ వసించెను. తరువాత నోడ నెక్కి తిరిగి తుపాను బీభత్సము గడచి చీనా చేరెను. చీనా సార్వభౌముని యాహ్వానమున బుద్ధభద్రుడను భారతీయ పండితుఁడా రాజస్థానమున నుండెను. ఫాహియాన్ బుద్ధభద్రునితోఁ గలిసి పెక్కుసంస్కృత గ్రంథములను చీనాభాష లోని కనువదించెను. ఎనుబదిరెండవయేట నొకసంస్కృత గ్రంథ మనువదించుచు "సిన్సు" సంఘారామమున ఫాహి యాన్ నిర్యాణమొందెను.

## యువాన్‌చాంగ్

ఫాహియాన్ తరువాత సుమారు రెండుశతాబ్దులకు యువాన్‌చాంగ్ చీనానుండి భారతదేశయాత్ర కుపక్రమించెను. క్రీస్తుశకము 629 సంవత్సరమునుండి 645 సంవత్సరమువరకు కాతఁ డాసియామధ్యఖండము భరతవర్షము పర్యటించెను. బుద్ధదేవుని పవిత్రజన్మభూమిని అందలి విహారసంఘా రామస్థూపముల నరయుటకు, భారతీయపండితులనుండి మూల బౌద్ధగ్రంథములను సిద్ధాంతములను దెలిసికొనుటకు యువాన్

చాంగ్ భారతయాత్ర కుద్యమించినట్లు చెప్పుకొనెను. అతడు భారత దేశమునుండి 657 బౌద్ధగ్రంథములు, సువర్ణ రజిత స్ఫటిక చందనదారు బౌద్ధవిగ్రహములను, 150 బుద్ధస్మారకావశేషములను చీనాకుఁ గొనితెచ్చెను. వానిని నిరువదిగుఱ్ఱములు మోయవలసి వచ్చినది.

దుర్గమారణ్యములను, మంచుటెనుక యెడారులను హిమాలయపర్వత శృంగములను దాటి బహుప్రయాసలకోర్చి యువాన్ చాంగ్ భారతదేశమును జేరెను. చీనారాజశాసనము విదేశయాత్రను నిషేధించెను. అతనితో బయలుదేరిన మిత్రులు వెనుదిరిగిపోయిరి. ఐదహోరాత్రము లొకసారి యువాన్ చాంగ్ త్రాగుటకు నీరులేకుండ గడుపవలసివచ్చినది. ఆతిథేయమర్యాదలతో గౌరవించిన యొకమహారాజు యువాన్ చాంగును పీడుటకు సమ్మతింపలేదు. అప్పు డతఁడు నిరశన వ్రతమునల్పి బంధవిముక్తుఁడు గావలసివచ్చినది. భారతదేశమున ఫాహియాన్ నిరపాయముగఁ బర్యటింపగల్గెను. యువాన్ చాంగు దారిదొంగలకుఁజిక్కి ప్రాణములు మాత్రము దక్కించుకొని బయట పడగల్గెను.

కన్యాకుబ్జమునుండి గంగానదిలోఁ బడవప్రయాణమున నాతని ముష్కరులు పట్టుకొని కాళికాదేవికి బలియివ్వ సంసిద్ధులైరి. కాని, యాకస్మికముగ వచ్చిన తుపాను దేవియాగ్రహమని తలపోసి యువాన్ చాంగును వారు వదలివేసిరి.

ఫాహియాన్ కాలమునాటి భారతదేశము యువాన్ చాంగునాటికిఁ జాల మారినది. గుప్తచక్రవర్తుల ప్రాపకమున హైందవమత మభివృద్ధి చెందినది.

బౌద్ధమతము క్షీణింపసాగినది. బౌద్ధమతమున మహాయానశాఖీయుల ప్రాభవ మధికమైనది. సంఖ్యాబలమున హీనయానీయులే ప్రబలులు. కానివారిలోఁ బాండిత్య విద్యాగౌరవము లడుగంట సాగినవి. యువాన్‌చాంగు యాత్రలలో విహారములతోపాటు దేవాలయము లనేకములను సందర్శించి నట్లు వ్రాసెను.

భారతదేశ మానాడు బ్రాహ్మణదేశముగాఁ గీర్తి సంపాదించెను. సంస్కృతమే యున్నత జాతీయవిద్య యయ్యెను. బౌద్ధులుగూడ సంస్కృతముననే గ్రంథములను వ్రాసిరి. వేద విద్య తిరిగి ప్రాముఖ్యమును సంపాదించుకొన్నది.

యువాన్‌చాంగు కాలమున నైష్ఠికబ్రహ్మచారుల సంప్రదాయము, ఋష్యాశ్రమ విజ్ఞానగవేషణ యడుగంటలేదు. అర్థవంతమైన యతనివాక్యములు స్మరణీయము. "లౌకిక ప్రపంచమునకు సుదూరముగ నిలిచెడి ప్రాచీనవిజ్ఞాన విద్వాంసులు తత్త్వగవేషణతో నేకాంతవాసమున జీవించెదరు. దూషణభూషణలకు వారతీతులు. అయినను వారికీర్తి దిగంత విశ్రాంతమై నిలుచును. పూజాగౌరవమర్యాదలతోఁ జూచెడి రాజులయాస్థానములకు వారుపోరు. ప్రజలు, ప్రభువులు, రాజోద్యోగులు వారిని మిక్కిలి గౌరవప్రపత్తులతోఁ జూచెదరు.

అట్లువారు సర్వజ్ఞులై పరిపూర్ణ విద్వాంసులు కాగలరు. శాస్త్రసాహిత్య ప్రబోధమున వారికి విశ్రాంతిలేదు. జ్ఞాన సముపార్జనకు వారెంతదూర ప్రయాణమునకైనను సరకు గొనరు. సంపన్న కుటుంబములయం దుద్భవించినను, వారు భిక్షాటనమున జీవించెదరు. వారికి జ్ఞానమే పరమార్థము. దారిద్ర్యము వారి కవమానము నాపాదింపలేదు.''

లౌకికలాభముల నెంచక జ్ఞానపిపాసయే పరమార్థముగ నెంచి, విరాగులై ప్రజలచే ప్రభువులచే మన్ననలనొందుచు విశ్వశ్రేయమే యాత్మజీవితాదర్శముగ నెంచిన విద్వాంసులను పురుషాంతరముల తరబడి సృష్టించిన ప్రాచీనభారతీయ విద్యావిధానము ప్రపంచ చరిత్రలో ననన్యము. అత్యద్భుతము.

## యువాన్‌చాంగ్ గాంచిన బౌద్ధవిహారములు :

గాజ్ దేశమున సర్వాస్తి వాదనకు జెందిన పదివిహారముల యువాన్‌చాంగ్ గాంచెను. అందు 300 భిక్షుకులు గలరు.

బమియను దేశమున లోకోత్తరవాదశాఖీయు లనేక భిక్షువులు గలరు.

కపిస్ రాజ్యమునందు ''కనిష్కుడు'' కట్టించిన విహారములు స్థూపములు గలవు. అచ్చటి 1000 విహారములతో మహా

యానశాఖీయభిక్షుకులు 6000 గలరు. లంపారాజ్యమునం బది విహారములు గలవు. అందు బౌద్ధభిక్షుకుల సంఖ్యకంటె నితరుల సంఖ్యయే యధికము. నాగరకోటయం దనేకవిహారములు గలవు. కాని భిక్షుకులసంఖ్య యల్పము. గాంధారమున 1000 బౌద్ధవిహారములు గలవు. అవి శిథిలావస్థలో నున్నవి. ఆరాజ్యమున నొకనాడు బౌద్ధము మిక్కిలి శోభతో వర్ధిల్లినది. అచ్చట నసంగుఁడు, నారాయణదేవుఁడు, వసుబంధుఁడు, పార్శ్వుఁడు మున్నగు బౌద్ధపండితులు వర్ధిల్లియుండిరి. రాజధాని పురుషపురమున కనిష్కుఁడు కట్టించిన పెద్దవిహారమందు యువాన్‌చాంగు కొద్దిమంది హీనయాన బౌద్ధభిక్షుకులను మాత్రమే చూడగలిగెను. ఆవిహారమందే బ్రాహ్మణపండితుఁడైన యశ్వఘోషమహాకవికి బౌద్ధదీక్ష నిచ్చిన పార్శ్వుఁడు నివసించెను.

కనిష్కవిహారమునుండి యువాన్‌చాంగు పుష్కరావతీ విహారమును జేరెను. (ప్రస్తుత హస్తనగరము) అచ్చటనే వసుమిత్రుఁడు పూర్వము తన యభిధర్మప్రకరణపద శాస్త్రమును రచించెను. ధర్మత్రాత పండితుఁడు గూడ నచ్చట గ్రంథముల వ్రాసెను. అచ్చట నాఁడు కొద్దిమంది మాత్రమే భిక్షుకులు గలరు. అచ్చటినుండి పాణిని జన్మించిన శలాతురనగరమును దర్శించెను.

ఉద్యానమున 1400 విహారములలో నొకనాడు 18000 భిక్షుకులు వసించిరి. కాని యువాన్‌చాంగ్ కాలమున నచ్చట గొందరు భిక్షుకు లాశిథిలవిహారములలో, నర్థ మెఱుగక బౌద్ధగ్రంథములను వల్లె వేయుచుండిరి. వారు మహాయానీయులు. అచ్చటినుండి యువాన్‌చాంగు బోలోరునందు పాండిత్యములేని భిక్షుకబ్రువుల నెందరినో కాంచగలిగెను.

అతఁడచ్చటినుండి తక్షశిల కేగెను. అచ్చటి విహారము లన్నియు శిథిలావశేషములుగా నున్నవి. అచ్చట నొకనాడు సౌత్రాంతిక పండితుఁడైన కుమారలబ్ధుఁడు వసించెను. అతఁడు బౌద్ధసూర్యచతుష్టయములో నొకఁడు. ఆర్యదేవుఁడు అశ్వఘోషుఁడు, నాగార్జునుఁడు మిగిలిన మువ్వురు.

అతఁడచ్చటినుండి కాశ్మీరమున కేగెను. అచ్చటి రాజు యువాన్‌చాంగును మిక్కిలి గౌరవించెను. అతఁడచ్చట రెండుసంవత్సరములుండి యనేక గ్రంథములకు వ్రాతప్రతులఁ బడయఁ గలిగెను. రాజతనికి నిరువది లేఖకుల నొసగెను. కాశ్మీరమందప్పుడు 500 విహారములు 5000 భిక్షుకులుండిరి. ఆనందుని శిష్యుఁడైన మధ్యాంతికుఁడు కాశ్మీరమున బౌద్ధమతమును నెలకొల్పెను. అశోకచక్రవర్తికాలమునఁ బాటలీపుత్రమునుండి 500 మంది యర్హతులు వచ్చి కాశ్మీర

మున 500 విహారముల నిర్మించిన గాథను యువాన్‌చాంగు వ్రాసెను.

అచ్చటినుండి, వసుబంధుఁడు నివసించిన శాకల విహారమును గాంచెను. యువాన్‌చాంగు చీనభుక్తివిహారమున రాజపుత్రభిక్షువు వినీతప్రభపండితునియొద్ద పదునాల్గు నెల లభిధర్మశాస్త్రముల నభ్యసించెను.

తమశావనము యువాన్‌చాంగు దర్శించిన యాత్రా విహారము. అచ్చట 300 సర్వాస్తివాదభిక్షువులు గలరు. అచ్చటి భిక్షువుల నశోకచక్రవర్తి తనయాస్థానమున కాహ్వానించెను. అచ్చట శాస్త్రవిద్వాంసుఁడు కాత్యాయనపుత్రుఁడు తన రచనలు సాగించెను.

జలంధరాజ్యమునందు 50 విహారములు గలవు. నాగరధన విహారమునందు చంద్రవర్మ పండితునియొద్ద నాలుగు నెల లభిధర్మశాస్త్రముల నభ్యసించెను.

మధురారాజ్యమున 20 విహారములు 2000 భిక్షువులు గలరు. స్థానేశ్వరమునందు మూఁడు విహారములు గలవు. పవిత్రజీపితమును గడపు 700 భిక్షువు లందుగలరు.

మతిపురమునఁబదివిహారములు, 800 భిక్షువులు గలరు. గుణప్రభపండితుఁడు శతగ్రంథముల నొకసమీపవిహారముననే వ్రాసెను. అనతిదూరమున సంఘభద్రపండితుఁడు నివ

సించు విహారము గలదు. అందు గుణప్రభపండితుని తత్త్వ సందేశశాస్త్రము నభ్యసించుచు యువాన్ చాంగు గడపెను. తొంబదియేండ్ల వృద్ధుఁడు గుణప్రభునిశిష్యుని యువాన్‌చాం గచ్చట సందర్శించెను.

యువాన్‌చాంగు తరువాత దర్శించినస్థలములు బ్రహ్మ పురము, గోవిశనము, అహిచ్ఛత్రము, విలాశానము, సంకా శ్యము.

కన్యాకుబ్జమునం దప్పుడు 100 విహారములు 10,000 భిక్షువులు గలరు. ఫాహియాన్ కాలముకంటె విహారభిక్షు వులసంఖ్య పెరిగినది. కన్యాకుబ్జమును యువాన్‌చాంగు కాల మున శ్రీ హర్షవర్ధన చక్రవర్తి పరిపాలించుచుండెను. అతఁడు మాంసాహారమును నిషేధించి, బౌద్ధసంఘారామములను నెలకొల్పెను. బౌద్ధధర్మప్రతిపాదికమైన నాగానందనాటకము శ్రీహర్షచక్రవర్తి సంస్కృతమున రచించెను. ప్రతిసంవత్సర మిరువదియొక్క రోజులు చక్రవర్తి మహోత్సవములు జరిపి బౌద్ధభిక్షుకుల రావించి వారిని సత్కరించుచుండెడివాఁడు. కన్యా కుబ్జమునందు భద్రవిహారమునందు వీరసేన పండితునియొద్ద బుద్ధదాసుని విభాషాశాస్త్రము నభ్యసించుచు మూడు నెలలు గడపెను.

తరువాత యువాన్‌చాంగు, నవదేవకులము, అయోధ్య ప్రయాగ, కోశాంబి, శ్రావస్తి, జేతవనవిహారము, కపిల

వస్తుపురము, వారణాసి, సార్నాథ్, వైశాలి, కుక్కుటారామము మున్నగు స్థలములను సందర్శించెను.

గుణమతి, శీలభద్ర పండితుల స్మారకచిహ్నములుగా నేర్పడిన విహారములను, మహాబోధివిహారమును యువాన్ చాంగు దర్శించెను.

భారతదేశయాత్రలో యువాన్‌చాంగు దర్శించిన విహారములలో నాలందావిహార మగ్రగణ్యము. ఆకాలమున విశ్వవిఖ్యాతిగన్న నాలందావిశ్వకళాపరిషత్తులో యువాన్ చాంగు యోగశాస్త్రసిద్ధాంతముల నభ్యసించెను. నాలందా విహారశీర్షికలో నీవిషయము ప్రకరణాంతరమున విపులీకృతము.

ధాన్యకటకి ప్రాంతమున ననేక శిథిలవిహారములు గలవనియు, నందిరువది విహారములలో మాత్రమే 1000 భిక్షువులు గలరని యువాన్‌చాంగు వ్రాసెను. అతఁడిచ్చట కొన్ని నెలలు అభిధర్మశాస్త్రగ్రంథముల నభ్యసించుచు గడపినట్లతని జీవితచరిత్రనుండి తెలియుచున్నది. యువాన్‌చాంగు భారతదేశమున పేర్కొనిన విహారములలోని భిక్షుకులసంఖ్య 212,130. ఈసంఖ్యలో నాత డనిర్దిష్టముగ "ననేకభిక్షువులు" "బహువిహారము" లని పేర్కొనినవి చేరలేదు. ఆతడు బౌద్ధవాఙ్మయప్రపంచమున స్థిరకీర్తి నార్జించిన పండితులను

వారు వసించిన విహారములను చేర్కొనెను. అసంగ, వసు బంధు, పార్శ్వ, అశ్వఘోష, నారాయణదేవ, ధర్మదార, మనోరథ, వసుమిత్ర, ధర్మత్రాత, ఈశ్వర, కుమారలబ్ధ, దేవ, నాగార్జున, మధ్యాంతిక, సంఘభద్రిస్కంధిల, పూర్ణ, బోధిల, వినీతప్రభ, గుణప్రభ, కాత్యాయనీపుత్ర, దిఙ్నాగ, భావవివేక, భద్రరుచి పండితుల ననేకులఁ చేర్కొనెను

అతఁడు మాంఘీరువిహారమునందు తథాగతగుప్త క్షాంతిసింహ పండితులయొద్ద నొకసంవత్సరము శాస్త్రాభ్యా సము సల్పెను. కాంచీపురవిహారమందాతఁడు, మహాపండిత భిక్షువుల సందర్శించెను.

ప్రాథమికవిద్య యువాన్‌చాంగు కాలమున విద్యార్థి యభ్యసింపవలెను.

1. వ్యాకరణము, 2. శిల్పస్థానవిద్య, 3. చికిత్స విద్య, 4. హేతువిద్య, 5. అధ్యాత్మవిద్య.

విహారములందున్న తశాస్త్రవిజ్ఞానము లభించెడిది. హీనయానీయులకు, ధర్మగుప్త, మహీశాసిక, కాశ్యపీయ, సర్వాస్తివాది, మహాసాంఘికసిద్ధాంతము లుపాదేయములు. భిక్షుకులు విహారములందు సభావేశమై వేదాంతతత్త్వచర్చ లు సలుపుచుండెడివారు. పెద్ద పరిషత్తులు జరిగినప్పుడు వా

దోపవాదములలోఁ బాల్గొనుటకు దేశములోని వివిధప్రాంత ములనుండి పండితు లేగుదెంచెడివారు. వాదమున జయించు టయే పాండిత్యమున కాకాలమునఁ బరమావధి. యువాన్ చాం గిట్టి వాదవిజయసంప్రదాయములనుగూర్చిన యైతిహ్య మును దనరచనలలోఁ బొందుపరచెను. నాగార్జునునిశిష్యుఁడు ఆర్యదేవుఁడు గుర్వాజ్ఞగొని యుత్తరముననున్న పాటలీపుత్ర ములోకేగి కుక్కుటారామమునగల తీర్థికులతోఁ బండ్రెండు నాళ్ళు వాదించి గెలిచెను. కాంచీపురవాసి వేగివిహారపండి తుఁడు దిజ్నాగుఁడు నాలందావిహారమున విజ్ఞానదిగ్విజయ మును సాధించెను. అశోకవిహారమున ధర్మపాలుఁడు 100 భిక్షువులలో నేడుదినములు వాదించి గెల్చెను. శ్రీహర్ష చక్రవర్తి యేటేట నేర్పరచిన పండితపరిషత్తులగూర్చి యువాన్‌చాంగు మిక్కిలి ప్రశంసించెను.

## ఇట్సింగ్

క్రీస్తుశకము 645 సంవత్సరమున యువాన్‌చాంగు భారతవర్షమునువీడి చనినతరువాత 672 వ సంవత్సరమున "ఇట్సింగ్" భారతదేశమును జేరెను. చీనాచక్రవర్తి సమక్ష మున రాజధానిలో యువాన్‌చాంగు నిర్యాణమున నాతనికి జరిగిన పూజాగౌరవములను ఇట్సింగ్ కనులార గాంచెను. "భదంత యువాన్ చాంగు"ను ఇట్సింగ్ చీనాతిపీఠకాచార్యు

నిగ స్తుతించినాడు. ఇట్సింగ్ పాహియాన్, యువాన్‌చాం గులను మార్గదర్శులుగ స్వీకరించెను. వారివలెనే బుద్ధభగ వానుని పవిత్రజన్మభూమి సందర్శింపవచ్చెను.

ఇట్సింగ్ భారతతీర్థయాత్రకు సోదరభిక్షుకులఁ గొంద రిని ప్రోత్సహించెను. చివరకు వారందరు వెనుకాడిరి. ఏకాకి యై "ఇట్సింగ్" వెనుకచూపునుపీడి గురూపదేశముల స్మరించు కొనుచు భారత దేశమును జేరెను. అతఁడు కపిలవస్తు, బుద్ధ గయ, వారణాసి, శ్రావస్తి, కన్యాకుబ్జ, నాలంద, వైశాలికుశి నగర, తామ్రలిప్తి క్షేత్రముల సందర్శించెను. ఇతరస్థలములను గూర్చి పరిశోధనలు జరిపి కొన్ని ముఖ్యవిషయములను వ్రా సెను భారతదేశమునుండి యతఁడు 500,000 శ్లోకములు గల 400 బౌద్ధగ్రంథములను సంపాదించి చీనాదేశమునకుఁ గొనిపోయెను.

ఇట్సింగ్ నాలందావిహారమునఁ బదిసంవత్సరములు విద్య నభ్యసించెను. అతఁడు సంస్కృతవ్యాకరణ పాండిత్యము నార్జించి సాహిత్యజ్ఞానము సంపాదింపగలుగుటచేఁ చీనాదేశ మున కేగిన తరువాత 256 సంపుటములలో 56 సంస్కృత గ్రంథముల ననువదింపగలిగెను.

ఆ కాలమున సంస్కృతమే యున్నతవిద్య. భారతవర్ష మునకు బ్రహ్మరాష్ట్రమని పేరు. బ్రాహ్మణపండితుల యాధి క్యమునుగూర్చి ఇట్సింగ్ బహుముఖములఁ గొనియాడెను.

యువాన్ చాంగువలెనే ఇట్సింగుకూడ నాటి ప్రాథమికవిద్యనుగూర్చి వ్రాసెను. "సిద్ధిరస్తు" తో నేడవ సంవత్సరమున ప్రారంభవిద్య గరపుదురు. అందు నలుబది యే డక్షరములు, 1000 శబ్దములు, 300 శ్లోకములుగలవు. ప్రారంభ విద్యాభ్యాస మారు నెలలు పట్టును.

8 వ సంవత్సరమున పిల్లలు పాణిని 1000 శ్లోకములను నెనిమిది నెలలలో నభ్యసించెడివారు. పదవసంత్సరమునుండి మూడేండ్లు "ధాతు" జ్ఞాన మలవరచుకొందురు. తరువాత జయాదిత్యవిరచితమైన 18000 శ్లోకములుగల కాశికావృత్తి పాణినిభాష్యము నభ్యసించెదరు. జయాదిత్యుఁడు సుప్రసిద్ధ పండితుఁడు. ఇట్సింగ్ వచ్చిననాటి కతఁడు మరణించి ముప్పదేండ్లయినది. తరువాత గద్యరచన, హేతువిద్య నభ్యసించెదరు. నాగార్జునుని న్యాయాధారతారకశాస్త్రము హేతు విద్యకుఁ బునాదిగ్రంథము. ఇట్సింగ్ దానిని క్రీ. శ. 711 సంవత్సరమందు చీనాభాషలోని కనువదించెను. సుహృల్లేఖ- జేతకశాతవాహనరాజునకు నాగార్జునుఁడువ్రాసిన పద్యలేఖ విద్యార్థుల కవశ్యపఠనీయము. దానిని సింహళమున ఇట్సింగ్ చీనాభాషలోని కనువదించెను. అశ్వఘోషునిబుద్ధచరిత్రము నందరు పఠించెడివారు. తరువాత విద్యార్థు లభిమానవిషయముల సమర్థులైన గురువులయొద్ద వివిధవిహారములలో నభ్యసించెడివారు.

భిక్షువులు కేవల మతగ్రంథములనేగాక వివిధవిజ్ఞాన విషయముల నభ్యసించెడివారు. ధర్మశాస్త్రము, రాజనీతి, సాహిత్యము, వ్యాకరణము మున్నగునవన్నియు విహార విద్యాలయములలో బోధింపబడు చుండెడివి.

బౌద్ధమతమున భిక్షుకులు తిరిగి గృహస్థాశ్రమమును జేరవచ్చును. భర్తృహరి యేడుసార్లు భిక్షుకధర్మమును స్వీకరించి యేడుసార్లు గృహస్థాశ్రమమును స్వీకరించిన కథ లోక ప్రసిద్ధము. భిక్షువులు పండితులై రాజాస్థానమున జేరి యుద్యోగములను సంపాదించినవారు, గృహస్థులైనవార లెందఱో గలరు.

ఇట్సింగ్ క్రీ. శ. 670—700 సంవత్సరములమధ్య భారతదేశమునగల సమకాలీనపండితుల నెందరినో ప్రస్తుతించెను. మగధదేశపండితుఁడు జ్ఞానచంద్రుఁడు యువాన్ చాంగు గురువు. నాలందావిహార విద్యాంసుఁడు రత్నసింహుఁడు సమకాలీనకవి. బాణుఁడు వ్రాసిన హర్షచరిత్రలోఁ బ్రస్తావింపబడిన దివాకరమిత్రుఁడు దక్షిణదేశమందలి తథాగతగర్భుఁడు. శ్రీ భోజద్వీపమందున్న భారతపండితుఁడు (సుమిత్రాద్వీపము) శాక్యకీర్తి, తామ్రలిప్తి విహారమందలి రాహులుఁడు, త్రిపీఠకములనేగాక యనేక శాస్త్రములందు నిష్ణాతుఁడు. వీరందరు, మతాచార్యులు మాత్రమేగాదు.

అనేక శాస్త్రములలో గడితేరిన పండితులు. దేశదేశముల నుండి వీరియొద్దకు జిజ్ఞాసువులై శిష్యులు వచ్చుచుండెడివారు.

ఇట్సింగ్ కాలమున చీనాదేశమునుండి, తక్కిన ప్రాచ్యదేశములనుండి యనేక విద్వాంసులు జిజ్ఞాసువులై వచ్చుచుండిరి. తామ్రలిప్తి విహారమునఁ బంద్రెండేండ్లు సంస్కృతము నభ్యసించిన మహాయానప్రదీపపండితునిగాంచెను. అతఁడు చీనీయుఁడు. యువాన్‌చాంగ్ శిష్యుఁడు. అతనిని మార్గదర్శిగా నిడుకొని ఇట్సింగ్ నాలందా, వైశాలీ, కుశినగర విహారముల సందర్శించెను.

నాలందావిహారమున జినప్రభ, రత్నసింహ పండితుల యొద్ద యువాన్‌చవో అంతకుముందు విద్యనభ్యసించెను. ప్రజ్ఞాదేవనామాంతరము నొందిన వ్రూహింగ్ నేగపట్నమున దిగి ఇట్సింగును గలియుటకు ముందు జినధర్మకీర్తుల న్యాయ సిద్ధాంతముల తిలాఢీవిహారమం దభ్యసించెను. భారతదేశమున విద్య నభ్యసించు మంగోలియనులను గూడ ఇట్సింగ్ చూచెను.

ఇట్సింగ్ చీనాకుఁ దిరిగివెళ్లి మూలసర్వాస్తివాద నికాయశాఖకు మూలపురుషుఁడయ్యెను.

# ప్రాచీన భారత విశ్వవిద్యాలయములు



## ప్రాచీన విశ్వవిద్యాలయములు

### త క్ష శి ల



ప్రాచీన కాలమున విశ్వవిఖ్యాతిఁగన్న భారతీయ విశ్వకళాపరిషత్తులలోఁ దక్షశిల యొకటి. పారస్వతమునకు సంఘమునకుఁగల బింబ ప్రతిబింబ భావమననుసరించి తక్ష శిల గౌరవప్రాముఖ్యములను జాతక కథలనుండి గ్రహింప వచ్చును. జాతకకథలలో సమకాలీనసాంఘిక చారిత్రక వృత్తములు ప్రతిఫలించుచున్నవి. తక్షశిల యున్నతవిద్యా కేంద్రము. అచటికి జిజ్ఞాసువులు విద్యా "పరిసమాప్తికిఁ" జేరెడివారు. కాని విద్యారంభమునకుఁ జేరెడివారుకారు. నిదర్శనప్రాయమైన జాతకకథలలోని యొకగాథ యచ్చటి విద్యావిధానము స్వయంవ్యక్తము చేయుచున్నది. ఒకప్పుడు కాశిని బ్రహ్మదత్తుఁడనురాజు పరిపాలించుచుండెను. కుమా

రుఁడు యువరాజు బ్రహ్మదత్తుఁడు. ప్రాచీనకాలమున రాజులు తమకుమారులను, రాజనగరముల సుప్రసిద్ధపండితులున్నను, విదేశముల విద్యాప్రబోధమునకై పంపెడివారు. ప్రపంచవిధులను పరిచయము చేయుటకు, శ్రమప్రయాసల కోర్చు శక్తి నిచ్చుట కిట్లుద్దేశింపబడెడిది. బ్రహ్మదత్తుఁడు పదునారేండ్ల కొమరుని వేయి బంగరు నాణెములు, ఆతపత్రము, పావుకోళ్ళ నిచ్చి తక్షశిలా విద్యాప్రబోధమునకు బంపెను. తండ్రి యాదేశానుసారము తక్షశిలఁ జేరెను. అచ్చట నధ్యాపకుని యావాసము నడిగి యచ్చటకుఁ జేరెను. ఆ పండితుఁ డప్పుడే తన యుపన్యాసము ముగించి వచ్చుచుండ నతఁడు పాదరక్షల విడిచి యాతపత్రమును దీసి భక్తి గౌరవములతో నమస్కరించెను. అధ్యాపకుఁ డతని నాహ్వానించెను. యువరాజు భోజనాదికముల ముగించి విశ్రాంతి నంది యధ్యాపకునిఁ జేరి సవినయముగా నిలచెను. ఆ పండితు డతఁడు వారణాసినుండి వచ్చినట్లును నతని తండ్రి కాశీరాజు బ్రహ్మదత్తుఁడనియు, జిజ్ఞాసువై విద్యాప్రబోధమునుఁ గోరి తన్ను జేరినట్లును తెలిసికొనెను. విద్యాబోధనకు బ్రతిఫలముగా దన శుశ్రూష జేయునో లేక ధనము నిచ్చునో యను పండితుని ప్రశ్నకు రాజకుమారుఁడు తాను తెచ్చిన వేయి నాణెములను వారిపాదసన్నిధి నుంచెను. ఇచట నివాసము చేయు జిజ్ఞాసువు లహోరాత్రము లధ్యాపకుని నాశ్రయించి

యుండెడరు. కాని ప్రతిఫలము ధనము నిచ్చు శిష్యులు తన యింట పెద్దకుమారునిరీతి నుండి విద్యాప్రబోధము నొందుదురు. పగటియందు గురువునొద్ద విద్యనభ్యసించి యీ యువరాజు పండితుఁ డయ్యెను.

ఈగాథ యీనాటి విద్యావిధానములోని ముఖ్యవిధులన్నిటి నెఱుక పరచుచున్నది. ఇంతేగాక, అనేక జాతక కథావృత్తములనుబట్టి యిచ్చటికి కాశీ, రాజగృహ, మిథిల, యుజ్జయిని, కోసల, మధ్యోత్తర ప్రాంతములనుండి జిజ్ఞాసువులు చేరినట్లు తెలియుచున్నది. తక్షశిలావిఖ్యాతికి కారణ మచ్చటి యుపాధ్యాయుల పాండిత్యప్రతిభలు. వారు ప్రపంచవిఖ్యాతిఁ గన్నవారు. తక్షశిల భారతీయ విజ్ఞాన కేంద్రము. దేశములోని వివిధప్రాంతముల విద్యాకేంద్రములన్నియు నీమహావిశ్వకళాపరిషత్తు కనుబంధములై యుండెడివి.

విద్యార్థులు తమ విద్యాపరిసమాప్తికై తక్షశిలకు పదునారేండ్ల వయసునఁ జేరి యుక్తవయస్కులై తిరిగివచ్చెడివారు. వైద్యవిద్య ముగించుటకుఁ దక్షశిలయందు జీవకుఁడను జిజ్ఞాసు వేడేండ్లు నివసించెను.

జిజ్ఞాసువులు వారి విద్యాపరిసమాప్తికి వలయు ప్రతిఫల ధనమునంతయు జెల్లించి తక్షశిల విద్యావిధానమునఁ బ్రవేశింప ననుమతిఁ బడయుదురు. వేయినాణెముల మొత్త

మును తక్షశిలావిద్యకు నిర్ణీతమైనట్లు దెలియుచున్నది. శిష్యు లలో ననేకులు ధనము చెల్లించనివారు పగలు గురుశుశ్రూష జేసి రాత్రుల విద్యాప్రబోధమును బొందెడివారు. ఒక్కొ కప్పుడు తనకాలమునంతయుఁ జదువునకే గడుపగోరి గురు శుశ్రూషఁజేయు నిష్టపడని జిజ్ఞాసువు తన విద్యాభ్యాసము ముగించిన తరువాత ధనమునిచ్చు నవకాశముఁ బొందెడి వాడు. ప్రాచీనకాలమున నధ్యాపకుని ధనము స్వర్ణరూప మునఁ జెల్లింపబడెడిదని తెలియుచున్నది. తక్షశిలలో నైదు వందలమంది జిజ్ఞాసువులుగల యొక విద్యాపరిషత్తు నొకటి గృహస్థాహ్వానించెను. ఈయాహ్వానము లొకదాని వెనుక నొకటిగా గురుశిష్యులకు భోజన సదుపాయముల సమ కూర్చెడివి.

ఒక్కొకప్పుడు వివిధదేశముల రాజకుమారులతోఁ దక్షశిలా విద్యాప్రబోధమునకుఁ గొందఱు విద్యార్థులు పోయెడి వారు. ఆ యా రాజ్యములు వీరివిద్యా ప్రబోధమునకగు వ్యయ మును భరించెడివి. అంతేగాక కొందరు విద్యార్థులు తమ యున్నత విద్యాసమాప్తికి విశ్వకళాపరిషత్తులఁజేరి రాజు సహా యము నందెడివారు. కాశీలోని యొకబ్రాహ్మణ జిజ్ఞాసువు తక్షశిలా పరిషత్తున నాయుధశాస్త్రమున ప్రత్యేకోన్నతవిద్య నందుటకై రాజుచేఁ బంపబడెను. అధ్యాపకు డచ్చట నొక వ్యవస్థగా నిర్వహింపఁబడు విద్యాశాఖాధికారిగాడు. జిజ్ఞాసు

వుల భోజన నివాసాదులకై యతడు తీసుకొనిన ధన మావశ్యకము.

పంచములుగాక మిగిలిన యన్ని జాతులవారును విద్యా కేంద్రమున ప్రవేశార్హత గలిగియుండెడివారు. అయినను వారు జాతి సంప్రదాయాను గతమైన విద్యలనే యభ్యసించెడి వారుకారు. తక్షశిలకొన్ని ప్రత్యేక విద్యాశాఖలలో ముఖ్య ముగ న్యాయవైద్యవిద్యలలో విశ్వవిఖ్యాతి నార్జించినది. దూరస్థమగు నుజ్జయినినుండిగూడ తక్షశిలా తర్కశాస్త్ర కేంద్రము జిజ్ఞాసువుల నాకర్షించి పేరెన్నికఁగన్నది. అందలి యాయుధవిద్య మిగులఖ్యాతికెక్కినది తక్షశిలా విశ్వకళా పరిషత్పండితు లస్త్రవిద్యాప్రబోధమునగూడ సుప్రసిద్ధులు. జ్యోతిపాలుఁడను నొక కాశీబ్రాహ్మణవిద్యార్థి కాశీరాజ ధనసాహాయ్యమునఁ దక్షశిలావిశ్వకళా పరిషత్తునఁ బ్రవేశించి యస్త్రవిద్య నభ్యసించి విద్యాపరిసమాప్తమున గురువుని యాదేశమున నైదువందలమంది జిజ్ఞాసువులకుఁదా నధ్యాపకుఁ డయ్యెను.

ఆ కాలమున ధనుర్వేదముగూడ ఋగ్యజుస్సామ వేద త్రయమువలెనే యెందరినో జిజ్ఞాసువుల నాకర్షించినది. ఒక నాడు తక్షశిలయందలి సైనిక విద్యాలయములో యావద్ భారత దేశమునందుగల రాజపుత్రులు నూటముగ్గురు శిక్షణ నందుచున్నట్లు చెప్పబడియున్నది.

తక్షశిలలోని సంగీతవిద్వాంసులుచేరి వారణాసిలో గానవిద్యకుఁ గీర్తి దెచ్చిరి. తక్షశిలలో వారణాసిలో విద్యాభ్యాస మొనర్చిన విద్వాంసులు సన్యాసాశ్రమమును స్వీకరించి యరణ్యములలో నాశ్రమముల నేర్పరచి విశేషకీర్తి నార్జించిరి. శ్వేత కేతువు వారణాసిలో నైదువందల శిష్యులుగల విద్యాలయమున ప్రథమశిష్యుఁడై వన్నెకెక్కి యున్నతవిద్య కొఱకై తక్షశిల కేగెను. అతఁ డచ్చటినుండి తీర్థయాత్రలు సలిపి, యాశ్రమమును నిర్మించుకొనిన గాథ తక్షశిలాప్రాముఖ్యమును స్వయంవ్యక్త మొనర్చుచున్నది.

వైద్యవిద్యలోఁ దక్షశిలాప్రాముఖ్యము జీవకునికథవలన దెలియనగును. బౌద్ధగ్రంథములనుండి ముఖ్యముగా "వినయ" మునుండి జీవకుని జీవితచరిత్ర సంగ్రహింపవచ్చును. రాజగృహమందలి సాలవతియను వేశ్యపుత్రుఁడు జీవకుఁడు అతని తల్లి, శిశువైన జీవకుని నొక మట్టిదిబ్బపైఁ బారవేసెను. ఆ శిశువును రాజకుమారుఁడైన యభయుఁడు రక్షించి పెంచెను. జీవకుఁడు యుక్తవయస్సునందు, "ఈరాజభవనములందు జీవనము సలుపుట కేదేని కళ యభ్యసింపవలెను. కళాభ్యాసముసల్పి నాజీవితమునుసార్థక మొనర్చుకొనెదను" అనితలపోసెను. తరువాత నతఁడు తక్షశిల కేగి జగత్ ప్రసిద్ధి గాంచిన యొకవైద్యునికడ విద్యనారంభించెను. అతఁడు గురుశుశ్రూషసల్పి యేడేండ్లు విద్యనభ్యసించి తనవిద్యాభ్యాస

మెప్పటికి సంపూర్తియగునో తెలుపవేడుకొనెను. గురువు శిష్యుని పరీక్షించిన విధమద్భుతావహము.

గురువు, శిష్యుఁడైన జీవకునకొక పారనిచ్చి తక్షశిల కేంద్రముగా నొక యోజనమునగల మొక్కలను బరిశీలించి వైద్యమున కుపయుక్తముగాని దానిని బెకలించి తెమ్మని పంపెను. జీవకుఁ డుట్టిచేతులతోఁ దిరిగివచ్చి యెంత వెదకినను వైద్యమునకు నిష్ప్రయోజకమైన మొక్కయొక్కటిగూడ కనిపింపలేదని గురువుతో నివేదించుకొనెను. గురువు సంతసించి జీవకుని వైద్యవిద్యాభ్యాసము ముగిసినదనియు, నతఁడు వైద్య విద్యానిష్ణాతుఁడనియు సెలవిచ్చి, కొంతధనమునిచ్చి యతని స్వగృహమునకుఁబో ననుజ్ఞనిచ్చెను. ఆధనము జీవకునకు సాకేతపట్టణము చేరువరకు సరిపోయెను. అచ్చటనే యతఁడు వైద్యవృత్తి నారంభించి ధనార్జనసలుప మొదలుపెట్టవలసి వచ్చినది. అచ్చట నొక సెట్టిభార్య దీర్ఘవ్యాధిచే బాధపడుచుండెను. ఎందరో పేరెక్కిన వైద్యులు విఫలులైరి. జీవకుఁడు రోగము కుదిరిన తరువాతనే ధనమును స్వీకరించుట కొప్పుకొని చికిత్స నారంభించెను. ముక్కులోనుండి యామెకు మందెక్కించి యామె తలనొప్పి తగ్గించెను. ఆ చికిత్సతో నతనికి పదునారువేల కాహాపణములు, రథము, రథాశ్వములు లభించినవి. వానిని రాజగృహమునఁదన్నుపెంచిన రాజపుత్రున కుపహారములుగా జీవకుఁడు సమర్పించెను. బింబిసారచక్రి

పరి_త్తమూలశంక వ్యాధిని గుదిర్చి జీవకుఁడు రాజవైద్యుఁ డయ్యెను. వారణాసిలో నొక సెట్టికొడుకు వ్యాయామసమయ మునఁ గ్రిందబడుటచేఁ గడుపులో చిన్న ప్రేగులు మెలికలు పడెను. సెట్టి జీవకుని రావించెను. జీవకుఁడు శస్త్రచికిత్స గావించి మెలికలు పడిన చిన్న ప్రేగుల యథారీతినుంచి తిరిగి కడుపు కుట్టివేసెను. ఈ శస్త్రచికిత్స వలన నతనికి 16000 కాహాపణములు లభించినవి. కొంత కాలమునకు బింబిసారుఁడు బౌద్ధమతమును స్వీకరించుటచే, జీవకుఁడు బుద్ధునకు, బౌద్ధ భిక్షుకసంఘములకు వైద్యుఁడయ్యెను జీవకుని చికిత్సకొఱకే గృహస్థులు విధిలేక బౌద్ధభిక్షుకులై తిరిగి గృహస్థులగుటను గాంచి బుద్ధుఁడు రోగగ్రస్తులు సంఘములో భిక్షుకులుగఁ జేరరాదని నియమమేర్పరుపవలసివచ్చినది.

దీనినిబట్టి బుద్ధునికాలముననే తక్షశిల వైద్యవిద్యా కేంద్రముగ జగత్ ప్రసిద్ధికెక్కినట్లు తలపవచ్చును.

## శ్రీ ప ర్వ త వి హా ర ము

దక్షిణ భారతదేశమున విశ్వవిఖ్యాతి నార్జించిన బౌద్ధ విశ్వవిద్యాలయములలో శ్రీపర్వత విహార మొకటి. ఈ శ్రీప ర్వత విహారము నాగార్జునాచార్యుని యావాసస్థలమని తారా నాథుఁడు వచించెను. గుంటూరు మండలములో నేటి నాగా ర్జునకొండయే ప్రాచీన శ్రీపర్వత విహారమని గుర్తింపవచ్చును.

నాగార్జున కొండయందలి బౌద్ధశిల్పశిథిలావశేషము లీవిషయ మునుఁ జెప్పకఁ జెప్పుచున్నవి. ఫాహియాన్ దక్షిణమున పోలోమొలో విహారము గలదని వచించినాఁడు. యువాన్‌చాంగ్ గూడ నీ విహారమును వర్ణించెను. పోలోమొలో యనగా చీనాభాషలోఁ బావురము. పావురమునకు సంస్కృతము పారావతము. శ్రీపర్వతవిహారము నే యుచ్చారణ సామ్యమువలననే చీనాయాత్రికులు భ్రమించి శ్రీపారావతి విహారమని పేర్కొని యుండవచ్చును. నేటికా పర్వతమునకు నాగార్జున కొండయనియే గుంటూరు మండలమునఁ బేరు. నాగార్జునుని శిష్యుఁడు సింహళీయుడైన నార్యదేవుని యస్థికల భాండము గుంటూరు మండలమున లభించినది. ఈ విహార విశ్వవిద్యాలయము నాగార్జునుని కాలమున సర్వతోముఖాభివృద్ధినొంది ప్రపంచ జిజ్ఞాసువుల నెందరినో యాకర్షించినది.

బౌద్ధమత ప్రపంచమున మాధ్యమికవాదమును బ్రపంచించిన తత్త్వవేత్త నాగార్జునుఁడు. బౌద్ధవేదాంతమున శూన్యవాద ప్రవక్త, హీనాయానము బౌద్ధప్రాచీనస్వరూపము. అర్వాచీనశాఖ మహాయానము. ఈ మహాయానమతమునకు నాగార్జునాచార్యులు నూతనసంస్థాపకులు గాక పోయిన, నాగార్జునాచార్యుల కాలములో మహాయానము నూత్నచైతన్యముతో విలసిల్లెననుట భూతార్థము. నాగార్జునుని నాగలోకయాత్ర ప్రజ్ఞాపారమిత సిద్ధాంతమునకు మూలము

ఐతిహ్యము నాగార్జునుని సర్వజ్ఞునిగా స్తుతించుచున్నవి. బౌద్ధగాథలు సిద్ధపురుషునిగాఁ బేర్కొనుచున్నవి. నాగార్జునుని గ్రంథములు ప్రాచీన చీనాసారస్వతమున బరివర్తనములై కనుపించుచున్నవి. భారతదేశమున నాగార్జునుని గ్రంథము లుపలభ్యముగా లేవు. అర్వాచీన భారతీయ గ్రంథములలో నాగార్జునుని నామము, గ్రంథములు నుదాహృతములు. నాగార్జునుని స్మరించని ప్రాచీన వైద్య గ్రంథము లేదు. అతడు శుశ్రుతమును బునరుద్ధరించెను. ఆరోగ్యమంజరిని కక్షపుత్రతంత్రమును రచించినాఁడు. నాగార్జునుని నేత్రనిదానము చీనాలో సుప్రసిద్ధము. విషవైద్యములో నాగార్జునుని చికిత్సను బాణుఁడు ప్రశంసించినాఁడు. వివిధరోగములకు నాగార్జునుని చికిత్సలు శిలాక్షరములుగా చీనాదేశమున స్తంభములఁ జెక్కించినారు. ఐతిహ్య మహోదమృతయోగము నందుకొన్నాఁడని కమ్మని కథలు జెప్పుచున్నది. నాగార్జునుని మహిమచే నతనికి సమకాలీనుఁడైన శాతవాహనరాజు నూటయేబది సంవత్సరములు జీవించినాఁడని, వృద్ధుఁడగుచున్న యువరాజు ప్రార్థనచే నాగార్జునుఁడు జీవితమును త్యజించినాడని యంతటితో శాతవాహనరాజుగూడ నాగార్జునునితో మరణించినాఁడని ప్రసిద్ధము. నాగార్జునుని రసరత్నాకరములో నతని నివాసము శ్రీపర్వతముగాఁ గన్పించుచున్నది. నేఁడు నాగార్జున కొండగా నున్న ప్రాచీన శ్రీపర్వతముపై

నాగార్జునుని సంఘారామములలో రసాయనిక పరిశోధనలు జరుగుచుండెడివి. నాగార్జునుడు భారత రసాయనిక శాస్త్రమునకు మూలపురుషుఁడని చెప్పవచ్చును. నాగార్జునుఁడు, సమకాలీనుఁడు స్కంధుఁడను సుప్రసిద్ధరసాయనిక పరిశోధకునిఁ జేర్కొనినాఁడు. నాగార్జునుఁడు ఖనిజకళానిష్ణాతుఁడు అతని రసాయనిక పరిశోధనలు సుప్రసిద్ధములు. అన్నభేదిఁగూర్చి ప్రథమమున ప్రపంచించినాఁడు. ఓషధీశాస్త్రము, రసాయనిక విద్య ఖనిజప్రయోగములు శ్రీపర్వతబౌద్ధవిశ్వవిద్యాలయమున నాగార్జునుని యాచార్యపీఠమున విశ్వవిఖ్యాతిని గణించినవి. యువాన్‌చాంగ్ నాగార్జునుఁడు రసవాదములో గూడ సిద్ధహస్తుడని వర్ణించినాడు.

ప్రజ్ఞాపారమిత శాస్త్రము, ప్రజ్ఞామూలశాస్త్రటీకము ప్రజ్ఞాప్రదీపశాస్త్రకారికలు; మూలమాధ్యమిక శాస్త్రము శూన్యసప్తతి, మధ్యాంతానుగమశాస్త్రము, వివాదసమాన శాస్త్రము ప్రమాణవిహేతనము, ఉపాయకౌశల్యహృదయ శాస్త్రము విగ్రహవ్యావర్తని కారికము, మున్నగునవి చీనా వాఙ్మయములో ఉపలభ్యమానములగుచున్న నాగార్జునుని గ్రంథములు.

జగత్తు కేవలము మిథ్యగాదు. కేవలము తథ్యమును గాదు. జగత్తు పరిమితసత్యము. ఏపదార్థమునకు నిరపేక్షిక

మైన యస్తిత్వములేదు. ఈజగచ్చక్రము సదా యీసత్యమే కేంద్రముగా పరిభ్రమించుచుండును. సృష్టి, లయములు, అస్తిత్వనాస్తిత్వసంబంధ భావములన్నియు మిథ్యములు. కావున మన భ్రమల కాద్యపరిష్కృతు లగుచున్నవి. అశాంతి దుఃఖముల కాలవాలమైన యీభ్రమలను మానవులు వీడ లేనంతకాలము, సుఖదుఃఖానుభవ డోలాకీలితమైన జీవితము నుండి విముక్తిలేదు. పరిమితత్వమున్నచోట సత్యములేదు. సత్యమునుఁ జేరుటకుఁ బరిమితతత్వమునుండి విముక్తిగలుగ వలెను. అప్పుడు సత్యములేక శూన్యము సాక్షాత్కరించును. శూన్యములేక నిర్వాణమనగా వైరుధ్యములన్నియు నదృశ్య మైన నిర్వికల్పమైన యపరిమితత్వము. ఇది నాగార్జున వేదాంతము.

శాతవాహన చక్రవర్తి నాగార్జునుని కొఱకొక పర్వతమును దొలిపించి విహారమును గట్టించెను. నాగార్జునుని గ్రంథములలో సమకాలీనులగు కనిష్కుఁడు, నశ్వఘోషుఁడు మున్నగువారి నామములు గన్పించుచున్నవి. నాగార్జునుని శిష్యుఁ డార్యదేవుఁడు, సింహళరాజవంశ చరిత్రయగు మహావంశములో క్రీ. శ. మూడవశతాబ్దిలో పరిపాలించిన విహారతిష్యునికి నభయుని సమకాలీనుఁడని గలదు. చీనా వాఙ్మయచరిత్రలో నాగార్జునుని ప్రజాపూరముల శాస్త్రము క్రీ. శ. 196–221 సంవత్సరములమధ్య హ్యూకన్ పరివర్తించి నట్లు గలదు. కావున నాగార్జునుఁడు క్రీ. శ. రెండవశతా

బ్రహ్మాంతమున లేక మూడవశతాబ్దాని జీవించినాడని చెప్ప వచ్చును. క్రీ. శ. 401 నాగార్జునుని గ్రంథములు చీనావాఙ్మయమున కుమారాజీవుడు పరివర్తించినాడు.

నాగార్జునుడు శాతవాహనరాజునకు వ్రాసిన సుహృల్లేఖవలన శాతవాహనరాజునకు సమకాలీనుడని తేలుచున్నది. ఇది ఛందోబద్ధమైన కవిత. దీని నిట్సింగ్ తామ్రపర్ణిద్వీపములో స్వయముగా చీనాభాషలోనికి బరివర్తనసల్పెను. తారానాథుడు నాగార్జునుడమరావతీస్థూపములోని యంతర్భాగమున బుద్ధధాతువును నిక్షిప్తముచేసి ప్రతిష్ఠించెనని వ్రాసెను.

నాగార్జునుడు వేదాంతి, కవి, రసాయనిక విద్యానిష్ణాతుడు, ఖనిజశాస్త్రపరిశోధకుడు, తార్కికుడు, ప్రాచీన భారతచరిత్ర నాగార్జునునికంటె పూర్ణపురుషుని బ్రసాదింపలేదు. వేదాంతములో నాగార్జునుని శూన్యవాదము మిథ్యాతత్త్వము శంకరుని మాయావాదమున కాద్యప్రకృతి. నాగార్జునుడు శంకరాచార్యులకు బూర్వరంగప్రవర్తకుడు. శ్రీపర్వతమున గుహారామ బౌద్ధవిశ్వవిద్యాలయమునకు నాగార్జునుడు కులపతి. శ్రీపర్వతసంఘారామము రసాయనిక జిజ్ఞాసకు, ఖనిజపరిశోధనలకు బ్రయోగశాల.

ఆర్యదేవుడు, నందుడు, నాగుడు, నాగార్జునుని శిష్యులు, భావవివేకుడు, దిఙ్నాగుడు మున్నగు తాత్త్వికులు

నాగార్జునున కర్వాచీనులు. దిఙ్నాగుని ప్రమాణసముచ్చయము తర్కప్రపంచమున సుప్రసిద్ధము. వీరందరు నాగార్జునుని శిష్యులు కాకపోయినను నాగార్జునుని ప్రభావము వారి రచనలపైఁ దత్త్వములపైఁ గనుపించుచున్నది.

ఆకాలమున నాగార్జునవిహార విశ్వవిద్యాలయము జగత్ప్రసిద్ధమై దేశదేశములనుండి జిజ్ఞాసువుల నాకర్షించినది.

నాగార్జున నిర్యాణానంతరము శ్రీపర్వతవిహారము పూర్వగౌరవవైభవములను గోల్పోలేదు. నాగార్జునుఁడు శాతవాహన చక్రవర్తులకు సమకాలీనుఁడు. శాతవాహన చక్రవర్తి శ్రీపర్వతవిహారనిర్మాణమున తన బొక్కసము నంతయు వెచ్చించినట్లును నసంపూర్ణముగా నిల్చిపోయిన విహారశిల్పములను దన స్వర్ణవాదవిద్యామహిమచే బంగారమును సృష్టించి నిత్యము సహస్రశిల్పులను బోషించి విహారనిర్మాణమును సంపూర్ణముఁ గావించిన కైంతిహ్య కథనము. శాతవాహనుని తర్వాత నాగార్జునవిహారమునకు రాజపోషకము పోలేదు. నాగార్జునుని నిర్యాణానంతర మిక్ష్వాకురాజు లుదారులైన సంపన్నప్రజలు నాగార్జునవిహారమును బోషించిరి. ఇక్ష్వాకురాజులైన వీరపురుషదత్తుఁడు మహాదేవి రుద్రభట్టారిక మున్నగువారు నాగార్జునవిహారమునకు దానము నల్పిరి. నాగార్జునవిహార విలసనమునఁ బేర్కొనదగిన రాజకాంత చాంతిసిరి.

చాంతిసిరి నాగార్జునకొండలోయలోని బౌద్ధశిల్పనిర్మాణములకు గర్భకేంద్రము. ఈమె "మహాదానపతిని" వీర పురుషదత్తుని యారవసంవత్సరమున బుద్ధధాతు నిక్షిప్తమైన మహాచైత్యమును వినిర్మించినది. ఆస్థూపమువ్యాస మిరువదియైదడుఁగులు. ధర్మచక్రాకారమున నున్నది. ఈశిల్పనిర్మాణములలో రాజకాంతలు నితరబౌద్ధధర్మప్రియు లనేకులు తోడ్పడినారు. రుద్రధరభట్టారికా మహాదేవి యొకయాయక ఖంభము దానముచేసినది. ఇక్ష్వాకు యడవి చాంతిసిరి, ఛతిసిరి, బాపిసిరినికాదేవి, చుల-చాంతిసిరినికాదేవి (కులహాకకన్యక) యాయకఖంభముల దానముచేసినారు. స్థూపముల సమీపమున విహారములు "చతియఘర"ములు నిర్మించినారు. చాంతిసిరి వీరపురుషదత్తుని పదునెనిమిదవ వత్సరమున నతని యాయుర్విజయమునకు మహాచైత్యసమీపమున నొక యాలయము ను గట్టించినది. ఈ యాలయమునకుఁ బ్రాచ్యభాగమున ముప్పదియారు శిలాస్తంభఖండములు నేఁడును గన్పించుచున్నవి. ఈ స్తంభములమీదనున్న శాసన ఖండములను సరిపోల్చిచదివిన, నిచ్చట నొకమండప ముండెడిదని చెప్పవచ్చును. పగునైదవ సంవత్సరము వర్షఋతువులో నెనిమిదవ పక్షమున నిది వినిర్మితము. నాగార్జున కొండలోయలోని ప్రాచీనబౌద్ధవిహార శిల్పావిలాసములు, శిథిలస్థూపసౌందర్య

రేఖావిన్యాసములు చాంతిసిరి యమృతహృదయమున కమర త్వము(ఁ గల్పించుచున్నవి.

రాజకాంతయైన చాంతిసిరితోఁబాటు నాగార్జునకొండ లోయలోని బౌద్ధశిల్పములకు సౌందర్య రేఖావిన్యాసముల దీర్చిదిద్దినది సామాన్యకుటుంబిని బోధిశ్రీ చిరస్మరణీయ. ఈమె బుద్ధాంబికా రేవతుల పుత్రిక. నివాసస్థానము గోవ గ్రామము. కోశాధిపతియైన భద్రుని మేనకోడలు. ఈమె రెండు చెతియ—ఘరుములకుఁ బునాదులనుఁ గట్టించినది. చులధమ్మగిరిపై నీమె కట్టించిన విహారము సింహళబౌద్ధ భిక్షువుల ప్రత్యేకావాసము. ఇంకను కలహావిహారము, బోధి వృక్షాలయము, సింహళవిహారము, మహాధమ్మగిరిపై నొక గుహ, మహావిహారములో నొక మండపస్తంభమును, దేవగిరి పై నొక ధ్యానమండపము, నొకతటాకము, పూర్వశైలము న నొకమండపము, కంటకశిలయొద్దగల మహాచైత్యద్వార మున శిలామండపము, హిరుంతువయొద్ద మూడుగుహలు, పపిలాసమీపమున సప్తగుహలు, పుష్పగిరియొద్ద నొక శిలా మండపమును నిత్యాదు లీమె దానకార్యములు.

మాఢరీపుతసిరి వీరపురిసదత్తునికి, వాసిష్ఠీభటిదేవా దేవికిఁ బుట్టినసుతుఁడు హువుళ చాంతమూలుఁడు. ఇతని భగిని కొదబలసిరి శాసనమునుఁబట్టి యతఁడు పదకొండు వత్సరములు

రాజ్యము సల్పినట్లు నిర్ణయింపవచ్చును. ఈమహారాజు ద్వితీయసంవత్సరమున భట్టిదేవామహాదేవి, బహుసుతీయ భిక్షుకులకొఱకుఁ గట్టించిన "దేవీవిహారము" పూర్తియైనది. ఈవిహారము నాగార్జునపర్వతపాదమున కీశాన్యదిశ నిటికరాళ్ళబోదుపై నున్నది. పదునొకొండవసంవత్సరమున కొదబలిసిరి మహీశాసలే భిక్షువులకొఱకొక విహారమును నొకచైత్యమును గట్టించినది. ఈచైత్యము నాగార్జునపర్వతసమీపమున కొట్టంపలను దిబ్బమీాదనున్నది. దీనిపయిఁగల యిరువదిగుహాలమధ్యనున్న శిలాస్తంభనిర్మితమైన మండపమునుండి కృష్ణానదీ ప్రవాహావిన్యాసము రమణీయదృశ్యముగ సాక్షాత్కరించును. ముప్పదియారు పాలరాతి స్తంభములునరువది చతురపుటడుగుల వైశాల్యమునుగల మండపమున నున్నవి.

చాంతిసిరి విశ్వసంసారమునకు స్వకుటుంబముకొఱకు నైహికాముష్మికసుఖముల నర్థించినది. స్వార్థవిరహితమైన యీ ప్రార్థనమహాయానవాదమును స్మరణకుఁదెచ్చుచున్నవి. యువాన్‌చాంగ్ మహాయానము ననుశీలించు భిక్షుకులాంధ్రదేశములో నివసించుచున్నట్లు వచించెను.

## నా లం దా వి హా ర ము

బీహారులో రాజగృహమున కేడుమైళ్ళదూరమున నవీన బరగాన్ పావారిక బుద్ధునికాలములో చూతవనము.

మహావీరుఁడిచ్చటనే పదునాలుగు వర్షఋతువులను గడపెను. గోశాలుని కలిసికొనెను అని భగవతీసూత్రమునఁ గలదు. సూత్రకృతాంగమున లేపుఁడను సంపన్నుఁ డిచ్చటనే బుద్ధున కాతిథ్యమిచ్చినట్లుఁ గలదు. క్రీస్తుశకము పదునైదు వందల ప్రాంతమునాటి తారానాథుఁడు బౌద్ధమతచరిత్రలో నాలంద శారీపుత్రుని జన్మభూమియనియు, నతని చైత్యము నశోకుఁడు దర్శించి యొకయాలయమును గట్టించెననియు వ్రాసెను ఈ యర్థములో నాలందావిహారమునకు మూలపురుషుఁ డశోకుఁడు.

మహాయాన బౌద్ధము వికసించిన తర్వాతనే విద్యానిలయముగ నాలందకుఁ గీర్తివచ్చినది. తారానాథుఁడు, నాగార్జునుఁడును, నార్యదేవుఁడునుఁ గొంతకాలమే నాలందలో గడిపినట్లు రచించినాడు. నాగార్జునుని సమకాలీనుడైన సువిష్ణువు నూటయెనిమిది యాలయములను మాహాయానాభిధర్మ సంరక్షణకొఱకు కట్టించినట్లు తారానాథుని కథనము. వసుబంధునిశిష్యుఁడైన దిఙ్నాగుఁడు బ్రాహ్మణుఁ సుదుర్జయుని మతచర్చలో నాలందలో జయించినట్లు జెప్పును క్రీస్తుశకమునాలుగవ శతాబ్దిని బ్రాహ్మణసంస్కృతీ నిలయమగుటచే ఫాహియాన్ నాలందను పేర్కొనలేదు. న—అలమ్—ద—ఇచ్చుటలో నాపుదల నెరుగనిది అని యువాన్‌చాంగ్ వ్యుత్పత్తి నిరూపించెను. అది బుద్ధుని కైదువందలమంది వర్తకులిచ్చిన దాన భూమి యని పేర్కొనెను.

పురుషాంతరములతరబడి యనేక రాజులు, ధర్మపురుషులు, నాలందకు భూదానముల నిచ్చిరి. విహారములఁ గట్టించిరి. అట్టివి యువాన్‌చాంగ్ కాలమున నారు విహారములు గలవు.

శకాదిత్యుఁడు, నతనిపుత్రుడు బుద్ధగుప్తుఁడు, తథాగతగుప్తుఁడు, బాలాదిత్యుఁడు, నతనికుమారుడు వజ్రుడు మధ్యభారతమున మరియొక యజ్ఞాతరాజు — నీయారుగురు ప్రభువులు నీవిహారములను నిర్మించిరి. ఆ మధ్యభారతప్రభువు శ్రీహర్షుఁడు గావచ్చును అతడొక విహారమును, సంఘారామమును, నలుబదిబిక్షుకులకు నిత్యాన్నదాన వృత్తినిఁ గల్పించెను. బాలాదిత్య విహారప్రవేశమహోత్సవమున రాజాహ్వానము నందుకొని, సర్వదేశములనుండి భిక్షుకులేతెంచిరి. అచ్చట భవనము లన్నియు హర్మ్యపరంపరలు, గోపురప్రాకార విలసితములు. ప్రాతస్సంధ్యానసమయమున ప్రాలేయావకుంఠనమునఁ గనిపించెడివికావు, హర్మ్యాగ్రములు మేఘమండలము నావరించెడివి. నీలాలనింగిలోఁ గదలి చెదరిపోయెడి మబ్బుదొంతరలు వాతాయనములలోనుండి దూరిపోవుచుండెడివి. సంధ్యారాగములు, జ్యోత్స్నా సౌందర్యములు, భవనశ్రేణులలో వెల్లివిరిసెడివి. యువాన్‌చాంగ్ వర్ణనము క్రీస్తుశక మొనిమిదవశతాబ్దిలోని యశోవర్మశిలాశాసనము తలపునకుఁదెచ్చుచున్నది. అచటి విహారావళులు శిఖరశ్రేణులు నంబుధరముల

నవలేహించుచున్నవి స్ఫటికనిర్మల జలపూరములై పద్మ వనవిలసితములైన సరోవరములును గలవు. విహారాభ్యాంతర ములు రమణీయశిల్పమయములైన స్తంభములతోఁ జిత్రవర్ణ రంజితములైన కుడ్యములతో భాసించినవి.

భారతదేశమున ననేక సంఘారామము లున్నవి. నాలంద సంఘారామ మాహాన్మ్యమున, తేజస్సున నద్వితీయ ము. అనేక రాజులచే ననేక పురుషాంతములనుండి నిర్మిత మైన నాలంద శిల్పసౌందర్య మనన్యమైనదని యువాన్ చాంగ్ వర్ణించినాడు. అతఁడు శ్రీక్రాదిత్యవిహారమున బుద్ధ విగ్రహము దర్శించెను. చీనాయాత్రికు డిట్సింగ్ ఎనిమిది మంటపములు మూడునందల గదులు సంఘారాములో గలవని చెప్పెను.

నేటి శిథిలావశేషములు :— పురావస్తుతత్త్వశాఖాధి కారులు భూగర్భమున మణగియున్న పురాతన నాలందా విహారమును దిఁగి త్రవ్వి ప్రదర్శించినారు. అందు నాలుగు విహారములు బయల్పడినవి. శిల్పవైభవమున నాలందావిహా రము యావద్ భారతమున నద్వితీయమైనదని కన్నింగ్ హామ్‌గారు నుడివినారు. దక్షిణమున నొకవిహారము, వాయు వ్యమున నింకొకటి, ఈశాన్యమున నాలయము దక్షిణ విహారమునకు పశ్చిమమున మఱియొక విహారము నేటికిని గనిపించు శిథిలావశేషములు. దక్షిణవిహారమున నుత్తరపు

గోడ రెండువందల మూడడుగుల పొడవు, నారడుగుల యా రంగుళముల మందము, పక్కగోడలు నూటయెనుబది యెని మిదడుగుల పొడవు, నేడడుగుల యారంగుళముల మందము. "ఈ గోడలువలె మంచి యిటుకలతో నింతయందముగ గట్టిన నిర్మాణముల నీమధ్య నేను చూడలేదు" అని జి. బి. స్ఫూనర్ గారు వ్రాసినారు. ఈ గోడలమధ్య తొమ్మిదియడుగుల యారంగుళముల, పదియడుగుల పదునొకొండంగుళముల, పంద్రెండడుగుల గదులుం గలవు. ఆ గదులలో నిద్రించుటకు శిలావేదికలుం గలవు. దీపము పుస్తకములు వ్రేలాడుట కాధారములుం గలవు. ఈ శిథిలావశేషములలో "శ్రీనాలందామహావిహార — ఆర్యభిక్షుసంఘ" లాంఛనము దొరికినది. ఆ లాంఛనముంగూడ సారనాథస్థూపములోని ద్విసింహపరివృతమైన ధర్మచక్రమే యగుట గణనీయము. ఒక ధ్యానబుద్ధుని ప్రతిమ దొరికినది. ఒక యెత్తైన బోధిసత్త్వుని పాషాణవిగ్రహము, నవలోకితేశ్వరుని విగ్రహముగూడ దొరికినవి. ఆ దేశమును బరిపాలించు ప్రభువు యువాన్‌చాంగ్ కాలమున నూరుగ్రామముల నిచ్చెను. ఇట్సింగ్ కాలమున విహారముక్రింద రెండువందల గ్రామములుపైగా గలవు. ఈ గ్రామములనుండి నిత్యము ధాన్యము పాలు వెన్న రెండు వందలమంది గృహస్థులు పంపుచుండెడివారు. పూర్ణవర్మ యను రాజు ఎనుబదియడుగుల తామ్రబుద్ధ విగ్రహమును

నాలందావిహారమునకు బహూకరించి యొక యున్నతమండ పమును నిర్మించి, బ్రతిష్ఠించినట్లు యునాన్‌చాంగు వ్రాసెను. సురేశ్వరవర్మలాంఛనము దొరికినది. యశోవర్మదేవుని మంత్రి నాలందాభిక్షువులకు నిత్యాన్నదానవృత్తిని విహారమునంతను కొనగల మహాధనరాశిని బహూకరించి నట్లొక శాసనమున గలదు. ఈ యశోవర్మదేవుఁడు క్రీ. శ. 728—745 లలో కనోజు పరిపాలించినాడని యూహింపవచ్చును. వంగ దేశమును బరిపాలించిన ధర్మపాలదేవుని తామ్రశాసన మొకటి లభించినది. ఒక శాసనమున సువర్ణద్వీపాధిపతి (సుమత్ర) బాలమిత్రదేవుఁ డొకవిహారము నిర్మించినట్లు గలదు. అతని రాయబారి బాలవర్మప్రార్థన ననుసరించి ఈ విహారమును బోషించుటకు దేవపాలదేవుఁడైదు గ్రామము లను దానము జేసినట్లు మరియొక శాసనమునఁ గలదు. ఒక శాసనమున నాలందాభిక్షువు వీరదేవుని దేవపాలుఁడభిమా నించినట్లు గలదు. వీరదేవుని పీఠాధిపతిగ భిక్షుకులు తర్వాత వరించిరి. వాగీశ్వరివిగ్రహమున గోపాలప్రభువు నామము గలదు. విగ్రహపాలుని కుమారుఁడైన మహీపాలప్రభుని యాఱవ సంవత్సరమున కళ్యాణమిత్రచింతామణి యను భిక్షువు అష్టసాహస్రికాప్రజ్ఞాపారమిత గ్రంథమునకుఁ బ్రతి వ్రాసినాఁడు. గూర్జరప్రతిహారరాజు, క్రీ. శ. పదవశతాబ్దిని

మగధను జయించిన మహేంద్రపాలదేవుఁ డొకచిన్న స్థూపమును గట్టించెను.

ఈదానములవలన నాలందావిహారమున నందఱకు నుచితముగ విద్యావాసములు, వసనములు, నాహారము, నౌషధములును లభించుచుండెడివి. యువాన్‌చాంగ్ కాలమున భిక్షుకులు తదితరులు నందరుగలసి బదివేలమంది యుండెడివారు. అధికారతారతమ్యములఁబట్టి భిక్షుకుల జీవితభృతులాధారపడియుండెడివి. యువాన్‌చాంగ్‌కు నాలందలో నిత్యము నూటయిరువదిఫలములు, కర్పూరము, రాజులు సంపన్నులును దిను మహాశాలిధాన్యము. వెన్న, పాలు, ప్రతిమాసమును నూనె మున్నగునవి లభించుచుండెడివి. ఇట్సింగ్ సమయమున భిక్షుకులసంఖ్య మూడువేలు దాటియున్నది.

ప్రాథమిక విద్యాభ్యాసానంతరము పరిపూర్ణతకై నాలందావిహారమును విద్యార్థులు చేరెడివారు. యువాన్‌చాంగ్ విదేశములనుండి పాండిత్యమును సంపాదించిన విద్యార్థులు తమసందేహ నివృత్తికొఱకు నాలందావిహారమునుఁ జేరి శాస్త్రమున నభినివేశమును సంపాదించి యశస్వులై మరలి పోయెడివారని వచించినాడు. మంగోలియానుండికూడ విద్యార్థులు వచ్చెడివారని ఇట్సింగ్ వ్రాసెను. చీనా కొరియా తిబెట్టు తొకారాదేశములనుండి యెందరో విదేశపండితులు

బౌద్ధమతగ్రంథముల కొరకుఁ బాండిత్యప్రతిష్ఠల నార్జించుటకు వచ్చెడివారు. "అచ్చట పండితులుజేరి సభలలో సమావేశమై సాధ్యాసాధ్యసిద్ధాంతములపై ఖండన మండనలను సలిపి చర్చించి వారివాదములు పెద్దల యంగీకారముఁ బడసిన విశాలయశస్సు నార్జించెదరు. నాలందావిహార మున్నతవిద్యా పరిశ్రమకై వచ్చు జిజ్ఞాసువులకుఁ గేంద్రప్రాయమైన విశ్వ కళాపరిషత్తు ఆకాలమున నాలందా విద్యాపీఠనామమును "తస్కరించిన" కుహనాపండితులుగూడ గౌరవము సంపా దించుకొనుచుండిరి" అని యువాన్ చాంగ్ వచించినాడు. పదిమందిలో నిద్దరుముగ్గురుమాత్రమే కృతార్థులుకాగల్గుచుం డిరి. ఇట్సింగ్ వచించిన ప్రకార మానాడు పదునైదవ సంవ త్సరమున నొకవిద్యార్థి వృత్తిసూత్రము నారంభించెను. ఇరు వదియవయేటముగించి తరువాత వేదాంతతర్కములను నాలం దావిహారమునలేదా వలభీసంఘారామమున నభ్యసింపవలెను. ఈ నాలందావిహారమున బ్రహ్మచారులు, ప్రాథమిక విద్యనుగూడ నభ్యసించుచుండెడివారు. నాలందావిద్యాలయముఁ బ్రవే శించు ప్రతివిద్యార్థియు నొకప్రవేశపరీక్షలో కృతార్థుఁడు కావలెను. నాలందావిద్యార్థులు భారతవర్షమున నాదర్శ ప్రాయులు. దేశదేశముల నాలందావిహారకీర్తి ప్రసరించుట చేతనే యువాన్ చాంగువంటి, ఇట్సింగ్ వంటి దూరదేశీయు లైన జిజ్ఞాసువు లెందరో యాకర్షింపబడిరి.

యువాన్‌చాంగ్ జీవితచరిత్రనుబట్టి నాలందావిహార ములోని భిక్షుకులు నిసర్గగంభీరులు. ఏడువందలసంవత్సర ములలో నియమముల నుల్లంఘించిన వారొక్కరును లేరు. "ఆ విహారమున వేలకొలది భిక్షుకులు వసింతురు. వందల కొలది పేరుకెక్కిన పండితులు విద్యాభ్యాసమునకుఁ జర్చలతోఁ బగలు సరిపోక రాత్రులుఁగూడ గడిపెడివారు. అందు వేయి మంది యిరువది సూత్రవృత్తులను, నైదువందలమంది ముప్ప ది సూత్రవృత్తులను, బదిమంది యేబది సూత్రవృత్తులను నభ్యసించిరి". యువాన్‌చాంగ్ కూడ నీ పదిమందిలో నొకఁడై యుండెను. శీలభద్రుఁడు యావద్విహారమునకు నగ్రాసనాధిపతి "అతఁడొక్కఁడే సర్వశాస్త్రములకు సూత్ర ముల నభ్యసించినవాడు. అతని ధీవిశేషము, ప్రౌఢనిర్భర వయఃపరిపాకము నతని నధ్యక్షస్థానము నలంకరింపఁజేసినవి. ప్రతిదినము విద్యార్థులు శ్రద్ధాభక్తులతో నునూరు వంద యుపన్యాసముల వినుచుండెడివారు. నాలందావిహారమున నాకాలమునఁ గల విజ్ఞానమంతయుఁ బ్రబోధింపఁబడుచుండె డిది. అందు మహాయానమును, మతగ్రంథములనేగాక, వేదములును హేతువిద్య, శబ్దవిద్య, చికిత్సవిద్య, సాంఖ్య విద్య యితరవిద్యల నెన్నియో యభ్యసించెడివారు. యువా న్‌చాంగు నాలందావిహారమున యోగశాస్త్రము నభ్యసిం చుటకే జేరెను. శీలభద్రుఁడు యోగశాస్త్రమున నాకాల

మున నద్వితీయుఁడని ప్రసిద్ధికెక్కెను. మహాయానమున మహాపండితుఁడని ప్రసిద్ధికెక్కిన యువాన్‌చాంగ్ గూడ నాలందావిహారమునఁ గొంతకాలము విద్యాభ్యాసముఁ జేసెను. హీనయాన మతావలంబియైన ఇట్సింగ్ గూడ పది వత్సరము లచట విద్య నభ్యసించెను. నాలందావిహార యశస్సునకుఁ గారణభూతులైన యుపాధ్యాయులను యువాన్ చాంగ్ కొందఱిఁ బేర్కొనినాఁడు. శీలభద్రునకుఁ బూర్వము నాలందావిహారమునకుఁ గులపతియైన ధర్మపాలుఁడు యోగశాస్త్రనిధియైన శీలభద్రుఁడు బుద్ధుని ప్రబోధములకు సౌరభమును గలిగించిన చంద్రపాలుఁడు సుగృహీతనామధేయులైన గుణమతి స్థిరమతి, నిర్మలవాద నిష్ణాతుఁడైన ప్రభామిత్రుఁడు నుదార ప్రసంగచతురుఁడైన జినమిత్రుఁడు విశేషశేముషీ ధురంధరుఁడు, సచ్ఛీలసంపన్నుఁడు నైన జ్ఞానచంద్రుఁడు నాలందావిహారమున విశ్వవిఖ్యాతిఁగన్న గురువులు. శ్రీహర్షుఁడుత్కళమునకు మహాయాన ప్రబోధమునకు యువాన్‌చాంగ్‌ను సాగరమతి ప్రజ్ఞారశ్మి సింహరశ్మిని పంపినాఁడు. నాటి యస్సాము ప్రభువు కుమారభాస్కరవర్మ నాలందాకులపతి యైన శీలభద్రుని యొద్దకు యువాన్‌చాంగ్‌ను పంపమని రాయబారిగఁ బంపెను. పంపుట కాలస్యమగుటచే మఱి యిద్దరు రాయబారులను బంపి యువాన్‌చాంగ్‌ను పంపకపోయినచో నాలందను నిర్మూలించెదమని బెదరించెను. శ్రీ

హర్ష చక్రవర్తి యస్సాముప్రభువును యువాన్‌చాంగ్‌ను దిరిగి పంపవలెనని, యట్లు పంపకపోయినచో శిరచ్ఛేదము జేసెదరని యాజ్ఞాపించెను. ఆ కాలమున యువాన్‌చాంగ్‌ను విజ్ఞానము కొరకభ్యర్థించిన రాజులెందరో గలరు. డి. బి. స్పూనర్ గారికి నాలందలో భాస్కరవర్మ రాజలాంఛనము దొరికినది. యువాన్‌చాంగ్ రాక నభ్యర్థించుచు నామహారాజు పంపిన లేఖతోఁబాటు నాలందకువచ్చిన రాజలాంఛనమదియే కావచ్చునని కె. యన్. దీక్షితులుగారి యూహ.

నాలందా విశ్వవిద్యాలయమున పీఠాధిపతి యెట్టి గౌరవమర్యాదలతో వ్యవహరించెడువాడో యువాన్‌చాంగ్ కథనముఁబట్టి స్పష్టమగుచున్నది. యువాన్‌చాంగ్ చేరుటకుముందే నాలందావిహారమున నతనికీర్తి చేరినది. అతనికి స్వాగతమిచ్చుటకు నాలందా విహారమునుండి నలుగురు వన్నెకెక్కిన పండితు లెదురేగిరి. వారితోఁబాటు రెండువందల మంది భిక్షుకులు వేలకొలఁది గృహస్థులు బయలుదేరిరి. ధ్వజములతో ఛత్రచామరములతో సుగంధ ధూపములతో నా యాత్రికుని నెదురేగించుచు మహోత్సవముతో వారు నాలందావిహారద్వారమువఱకు దీసికొనివచ్చిరి. స్థవిరునియాధిపత్యమున నొక మహాసభ జరిగినది. అతిథి నుచితాసనమున నుపవిష్టునిగావించిరి. ఘంటానినాదములతో ధర్మాధిపతిచే

విహారమున నివసించునంత కాలము భిక్షుకులుపయోగించు సమస్తవస్తువులు, సర్వపదార్థజాలము లితరులతోఁ బాటతనికి గూడ సంపూర్ణముగ జెందెను" అని ప్రకటింపఁబడినది.

ఆ సభలో నిరువదిమంది సుప్రసిద్ధపండితులను యువాన్ చాంగ్‌ను కులపతిని జేరగనే ముఖ్యపండితుఁడు సాష్టాంగదండ ప్రణామమును సలిపి వినయ వినమిత శిరస్కులై యువాన్ చాంగ్‌ను నివేదించిరి. కుశలప్రశ్నానంతరము కులపతి వారందరకు నాసనములను దెప్పించి పరిపించెను. వారంద రుపవిష్టులైన తర్వాత, "ఏ దేశమునుండిరాక?" యని అతి థిని ప్రశ్నించెను. యువాన్‌చాంగ్ "నేను చీనా దేశము నుండి తమసాన్నిధ్యమున యోగశాస్త్రము నభ్యసించుటకు వచ్చితి" నని చెప్పెను. తదుపరి బాలాదిత్య విహారమున జ్ఞాన వయోవృద్ధుడైన బుద్ధభద్రునిగదిలో నతని కొక కవారమా వాస మేర్పరుపఁబడెను. తరువాత నొక స్వతంత్రావాస మేర్పడినది. ఇద్దరు పరిచారకులు, నొక యేనుఁగు కూడ నతనికిచ్చిరి. పరిచారకులిద్దరిలో నొకఁడు మాణవకుఁడు మరి యొకఁడు బ్రహ్మచారి.

నాలందావిహారమున దినచర్య నిర్ణీతకాలబద్ధమై యుండెడిది. దినమున కెనిమిదిజాములు. ప్రతియామమునకు నాల్గుసారులు ఘంకానినాదము, రెండుసారులు శంఖారావము తిరిగి ఘంకానినాదము, ద్వితీయయామము నుట్టమధ్యాహ్నమున

సమాప్తి జెందును. రాత్రి ప్రథమయామానంతరము ఢంకా నినాదము వెలయును. ఉదయాస్తమయముల బహిఃద్వారము ల సేవకులు ఢంకానినాదము సల్పెడివారు.

ప్రతిదినము ప్రాతస్సంధ్యాసమయమున ఘంటానినాద ము స్నానవేళను సూచించును. నాలందావిహారమునఁ బది సరోవరములు గలవు. అంగవస్త్రములతో భిక్షుకులు గుంపులు గుంపులుగా విహారాభ్యంతరముల వెలువడి స్నానాదిక ముల నాచరింతురు, కొందఱు విహారమందిరములనే స్నాన మాచరింతురు. ద్వితీయయామమునకుఁ బూర్వమే భోజనాది కములఁ ముగింతురు. నాలందావిహారమున నానాదేశాగత విద్యార్థిబృందములు సంపూర్ణసామరస్యములతో మెలఁగుచుం డెడివారు. వాగ్యుద్ధములకు సిద్ధాంతరాద్ధాంతములకు ఖండన మండనములకుఁ బేరుపొందిన నాలందావిహారమున సంస్కార సామరస్యము సంపూర్ణముగా నెలకొనియుండు టొక విచిత్ర విరోధాభాసము. వ్యష్టిలో సమష్టిని సాధించిన సంస్కార పురుషు లానాటి నాలందా విద్యార్థులు. భావస్వాతంత్ర్యము, పర మతసహనము నాలందా విహారవిద్యా విధానములోని విశిష్టత ప్రబోధస్వాతంత్ర్యమును ప్రపంచచరిత్రలో జయప్రదముగ సాధించి ప్రదర్శించిన ప్రయోగశాల ప్రాచీన నాలందా విహా రము. బుద్ధుఁడు పరమతసహనముఁ బరమధర్మముగా బ్రబో ధించెను. అశోకుఁడుఁగూడ పరమతసహనముఁ బ్రబోధించెను.

ఇట్సింగ్ నాలందావిహారమున క్రీస్తుశక మూరువందల డెబ్బది యైదు నుండి యారువందల డెబ్బదియెనిమిదివరకు విద్యనభ్యసించెను. అతఁడు నాలుగువందల సంస్కృతగ్రంథములను (ఏబదివేల శ్లోకములతో) సంగ్రహించెను. రత్నసాగర, రత్నోదధి, రత్నరంజక — ఇవి గ్రంథాలయములు. రత్నసాగరము తొమ్మిది యంతస్థులహర్మ్యము. అందు ప్రజ్ఞాపారమితసూత్ర, సమాజగుహ్య మున్నగు నపూర్వగ్రంథము లుండెడివి.

క్రీస్తుశకము 630 సంవత్సరమున సింహాసనము నధిష్ఠించిన 'తిబెట్టు' ప్రభువు 'సాంగ్ — ట్సన్ — గంపో' తన మంత్రి 'థోన్ - మి'ని విశేష కాంచన రాసులతో భారత దేశమునకుఁ బంపెను. థోన్ — మి సంస్కృతపండితుఁడు లిపిదత్తునియొద్ద సంస్కృతమును స్మృతులను నభ్యసించి తరువాత నాలందావిహారమున 'ఆచార్యదేవవిద్యాసింహుని' దగ్గఱ శిష్యునిగఁ జేరి బౌద్ధబాహ్యసాహిత్యముల నభ్యసించెను. ఆకాలముననే యువాన్-చాంగ్ గూడ నాలందకు వచ్చెను. క్రీస్తుశకము 743—789 లలో తిబెట్టును పరిపాలించిన 'తి— స్రాంగ్ - దెన్ - సాట్సన్' భారతదేశమునుండి యుద్యానవాసి పద్మసంభవుని, గౌరవాసి శాంతరక్షితుని నాహ్వానించి రప్పించుకొనెను. శాంతరక్షితుఁడు నాలందావిహారకులపతి. వారిద్దఱు నొక చీనాపండితునితో వాదమును సలిపి యతని నోడించలేకపోయిరి. అప్పుడు వారి యీదేశమున 'తిబెట్టు'

రాజు నాలందావిహారమునం దంత్రవిద్యానిపుణుండైన కమల శీలుని క్రీ. శ. 750 సంవత్సరమున నాహ్వానించెను. కమల శీలుండు రాజసభలో నా చీనాపండితుని వాగ్వివాదమునం జయించెను.

నాలందావిహారము విజ్ఞానజ్యోతిని ప్రసరించు విశ్వ కళాపరిషత్తుగ దిగ్విజయమును సాధింపంగలిగెను. నాలందా పండితులు దేశదేశమున సుప్రసిద్ధులై దిగ్విజయముల సాధిం చుటయే దీనికి నిదర్శనము. విదేశము నాలందాపండితుల నాహ్వానించి శిరసావహించినది. ప్రాచ్యదేశములన్నియు నాలందావిహారమును విశ్వజ్ఞాన కేంద్రముగం బరిగణించి నవి. పురుషాంతరముల తరబడి జిజ్ఞాసువులు సాహితీయాత్రి కులై నాలందా విహారమున కసంఖ్యాకులు తరలివచ్చిరి. వీరిలో గొందరి నామధేయములు మాత్రమే చరిత్రకు బరిచితములు. యువాన్‌చాంగ్ తరువాత నిట్సింగ్ వచ్చిన నలుబదిసంవత్సర ములమధ్య 'థోన్ - మి-యువాన్‌చి'యు తౌహి - హ్యూ-లు తాంగ్-తౌ-సింగ్ ఆర్యవర్మ బుద్ధవర్మ నాలందా విహారమునం జీనావిద్యార్థులు. పదవ శతాబ్దిలో జీనామతగురువులు. జే-కొంగ్, కి-యి నాలందకు విచ్చేసిరి.

విదేశములనుండి నాలందకు విద్యార్థులు వచ్చినట్లే నాలందావిద్యాపీఠము విదేశములకు విద్యాగురువులం బంపె డిది. ప్రాచ్యదేశములందు విజ్ఞానవికాసమునకు మార్గదర్శకు

లై నవారలు నాలందావిహారవిద్యాస్నాతులు. నాలందావిహారమున తిబెట్టుశాఖ యొకటియుండెడిది. అచ్చట విద్యార్థులు తిబెట్టుభాష నభ్యసించి బౌద్ధమతగ్రంథములను, సంస్కృత గ్రంథములను 'తిబెట్టు' భాషలోనికి ననువదించిరి. తిబెట్టుకు నూత్నమతమును బ్రసాదించి నేటికిని నిలిచియున్న నూత్న జీవితపథమునకు సంస్కార రేఖావిన్యాసములను దీర్చిదిద్దినది. నాలందావిహారము. ఆర్యదేవుని గ్రంథములు తిబెట్టుభాషా ముఖమున తిబెట్టుఁజేరినవి. అతని చరమగ్రంథము 'మాధ్యమక బ్రహ్మఘాతనామ' నాలందలో 'స్వంబుకి-గ్లిన్-గి-ర్గ్యల్-పొ' యను జంబూద్వీపరాజు సుభాచార్యుని ప్రార్థనానుసారము రచింపఁబడినది. క్రీ. శ. 980 లో జన్మించిన యుపాధ్యాయ దీపాంకుర శ్రీజ్ఞానదేవుఁడు తిబెట్టులోని కనువదించెను.

శీలభద్రుఁడు రచించిన యార్యబుద్ధభూమివ్యాఖ్యానము తిబెట్టు త్రిపిటకలలో నొకటి. యువాన్-చాంగ్ కాలమున శీలభద్రుఁడు నాలందావిహారాధ్యక్షుఁడు. ధర్మపాలుఁడు శీలభద్రునికిఁ బూర్వము నాలందావిహారాధ్యక్షపీఠమున నధివసించెను. 'వర్ణసూత్రవృత్తినామ' యను వ్యాఖ్యానగ్రంథమును మహాచార్యచంద్రగోమి వ్రాసిన వ్యాకరణముపై వ్రాసెను. అతని "యాలంబన ప్రత్యయధ్యానశాస్త్రవ్యాఖ్య, విద్యామాత్రసిద్ధిశాస్త్రవ్యాఖ్య, శతశాస్త్రవైపుల్యవ్యాఖ్య,

వాలితత్త్వసంగ్రహము''లు టిబెట్టుభాషలోని కనుపడింపఁ బడినవి.

చంద్రగోమి-యశోక, స్థిరమతులను నాచార్యులను సేవించి బౌద్ధమతగ్రంథముల నభ్యసించెను. అతఁడు వ్రాసిన యఱువది సంస్కృతగ్రంథముల నువాదరూపమునఁ దిబెట్టులో వెలసినవి. అతఁడు దక్షిణమునకు వెళ్ళి పాణిని సూత్రము లకుఁభాష్యము వ్రాసెను. నాలందావిహారమందు చంద్రకీర్తి కూడ పాణినికి వ్యాఖ్యానము వ్రాసెను. చంద్రకీర్తియే చంద్రగోమిని నాలందావిహారమునకుఁ బరిచయముఁ గల్గించి యతనికి మూడురథములతో స్వాగతము నర్పించునటులఁ జేసెను. తారానాథుఁడు, చంద్రగోమి యెనిమిదవ శతాబ్ది వాఁడని శ్రీహర్షనిపుత్రుఁడైన శీలుని సమకాలికుఁడనివ్రాసెను.

శాంతరక్షితుఁడు ఎనిమిదవశతాబ్దిని బౌద్ధసభ్యతను 'టిబెట్టు' లో ప్రవేశపెట్టిన మహావిద్వాంసుఁడు. అతఁడు టిబెట్టు వచ్చినప్పుడు రాజమర్యాదలతో సేనానివహములు స్వాగత మాచరించుచు రాజప్రాసాదమునకుఁ దీసికొని పోయెను. క్రీస్తుశకము 749 సంవత్సరమున నాతని యాదేశ మున టిబెట్టురాజు ప్రథమబౌద్ధవిహారమును నిర్మించెను. ఈ విహారమునకు మాతృక బీహారులోని యొదంతపురీవిహారము. శాంతరక్షితుఁ డీవిహారమున పీఠాధిపతియై పదమూడు వర్ష ములు కృషిఁజేసి క్రీస్తుశక మేడువందల యిరువదిరెండులో

నిర్యాణముఁజెందెను. ఆతఁడు వాదన్యాయవృత్తి విపంచితార్థము తత్త్వసంగ్రహామునను రెండుగ్రంథములను రచించెను. అతనితో వచ్చిన పద్మసంభవుఁడు తాంత్రికయోగాచార్యతత్త్వమును బ్రతిపాదించెను. అతని "సమయపంచశిఖ" కు తిబెట్టుభాషలో ననువాదము గలదు. వీరి యాహ్వానమునఁ గమలశీలుఁడు తిబెట్టు రాజాస్థానమునఁ జీనా విద్వాంసునిఁ గెలిచెను.

స్థిరమతి : నాలందావిద్వాంసుఁడు. ఇతఁడు తిబెట్టు, సంస్కృతభాషలలోఁ బండితుఁడు. ఇతఁడు స్వయముగా సంస్కృత గ్రంథముల నెన్నిటినో తిబెట్టుభాషలోని కనువదించెను. సంస్కృత వ్యాకరణములను, కలాపవిధానమును తిబెట్టులో వ్యాప్తిఁ దెచ్చెను. నాలందలో నితఁడు శాస్త్రానుశీలనమునకుఁ బేరుపొందిన తారాభట్టారి కాలమునందు నివసించెడివాఁడు.

బుద్ధకీర్తి : ఇతఁడు తొలుత విక్రమశిలా విహారమున మహాపండిత "అభ్యాకర" గుప్తునకు సహాధ్యాయుఁడు. నాలందా విహారమునుండి తిబెట్టుఁజేరి యక్కడ తాంత్రిక బౌద్ధమును బ్రబోధించెను.

కుమారశ్రీ తిబెట్టులో త్రిపీఠిక సూచికను నిర్మించెను. నాలందావిహారమునఁ గర్ణపతి మహాయాన లక్షణసముచ్చయమును దిబెట్టుభాషలోని కనువదించెను. కర్ణశ్రీసూర్యధ్వజులు గూడ తిబెట్టుభాషలోనికిఁ గొన్ని సంస్కృతగ్రంథము

లను భాషాంతరీకరణ మొనర్చిరి. సమతీసేనుడు చాలకాలము నాలందలో నివసించి కర్మసిద్ధాంతమును సంస్కృతమున రచించెను.

## చీనాలో నాలందా విజ్ఞాన ప్రచారకులు :

కుమారజీవుడు, గుణవర్మ, క్రీస్తుశక మైదవ శతాబ్దిలో విదేశములలో భారతవిజ్ఞాన ప్రచారకులు. వారి యడుగుజాడలలోc దరువాత నెందరో చీనావెళ్ళి విజ్ఞాన ప్రచారముcజేసిన వారు నాలందావిహారపండితులే. శుభకరసింహుc డెనిమిదవ శతాబ్ద్యారంభమునc జీనాలో స్థిరనివాస మేర్పరచుకొనెను. సోంగ్ రాజవంశమున [960–1127] నాలందాపండితుcడు ధర్మదేవుcడు రాజాస్థానమున ననువాదకుcడుగా నలువది యాఱు మతగ్రంథములc జీనాభాషలోని కనువదించెను. ఇందు బుద్ధహృదయధారిణి మొదలగు గణనీయ గ్రంథములు గలవు. క్రీస్తుశకము 981 తరువాత డెబ్బదిరెండు గ్రంథములను భాషాంతరీకరణము జేసెను అందు మహాయానగ్రంథము సుభావతీవ్యూహ మొకటి.

## నాలందలోని విదేశవిద్యార్థులు :

నాలందావిహారమున జిజ్ఞాసువులై విద్యాభ్యాస మొనర్చిన వారినందరిని బేర్కొనుట యసాధ్యము. చీనాయాత్రికుcడు పాహియాన్‌తోcబాటు వైక్యేకింగ్, తమోచింగ్ వైలింగ్

మున్నగు వారునుఁ గలరు. అతఁడు భారతదేశములో "తార్తార" దేశీయుఁడైన జ్ఞానుప్రుఁ గలిసికొనెను. యు వాన్‌చాంగ్ ఇట్సింగ్ విజ్ఞానయాత్రలు చిరస్మరణీయములు యువాన్‌చాంగ్‌నకు, ఇట్సింగునకును మధ్య నలుబదిసంవత్స రములు మాత్రమే యంతరము గలదు. ఆస్వల్పకాలములో చీనా, జపాను, కొరియా మున్నగు దేశములనుండి యేబది యార్గురు యాత్రికులు విద్యార్థులై నాలందావిహారముఁ జేరిరి. కొందరు తామ్రలిప్తి మీదుగా సముద్రమార్గమునుండి, మరి కొందరు నేపాలు, టిబెట్టు భూమార్గములనుండి ప్రమాద ప్రయాసలను లెక్కఁజేయక వచ్చిరి.

హియూన్ — చాయ్ - ఇతఁడు టిబెట్టుమార్గమునుండి నాలందను జేరుకొనెను. మొదట జలంధర్ సమీపమున సంస్కృతము నభ్యసించెను. అచ్చటనుండి నాలందావిహార మున మూడు సంవత్సరము లున్నతవిద్య నభ్యసించెను. ఇతఁడు సహపాఠియైన చీనావిద్యార్థి షిన్ - కోంగ్‌ను, నొక సింహాళీయునిఁ బేర్కొనెను. ఇతఁడు తిరిగి క్రీ. శ. 664 లో నాలందకు వచ్చెను. అప్పుడిట్సింగితనినిఁ జూచెను.

తాక్-హీ : ఇతని సంస్కృత నామధేయము శ్రీ దేవుఁడు. మహాయానమును నాలందలో నభ్యసించెను.

హుయ్యా-హే : ఇతఁడు కొరియావాసి. నాలందలో జిర కాలము వసించి యరువదియవయేట మరణించెను. ఇతఁడు

వ్రాసిన సంస్కృత గ్రంథముల నిట్సింగ్ చూచెను. బోధి ధర్ముఁడను తుకారదేశీయునిఁగూడఁ జూచెను.

తాయ్—షింగ్ : ఇతని సంస్కృతనామము చంద్రదేవుఁడు. క్రీ. శ. 649 లో నాలందనుఁ జేరెను. తాఁగ్ సముద్రమార్గమునఁ దామ్రలిప్తిఁజేరి యచ్చట సంస్కృతము నభ్యసించి తరువాత నాలందఁజేరెను. తాయ్-లిన్ శీఃప్రభ నామాంతరము వహించి యీవిధముగనే నాలందనుఁజేరెను. హ్యూమ్-తా సముద్రయానమున నాలందజేరి పదిసంవత్సరములు వసించెను. నొకింగ్ నాలందలో యోగశాస్త్రము నభ్యసించి యచటనే మరణించెను. ఇట్సింగ్ పేర్కొనుటచే వీరినామములు మన కుపలభ్యమానములైనవి. నలుబది సంవత్సరములలో నేబదియేడుమంది యుండుటచేఁ జరిత్ర కందని యజ్ఞాతజిజ్ఞాసువు లెందఱో యుండెడివారని యూహింపవచ్చును.

ఐతిహ్యము నాగార్జునార్యదేవులకు నాలందావిహారమునకున్న సన్నిహితసంబంధముఁ గల్పించుచున్నది. చంద్రభూపతి పదునాలుగు మండపములను విద్యాలయములనుఁ గట్టించినపుడు నాలందలో విద్యాపీఠమును రాహులభద్రుడధివసించెను. తారానాథుఁడు క్రీస్తుశక మైదవశతాబ్దిలో

వసంగుపు తన యవసానకాలమునఁ నాలందలో నివసించి నట్లు వ్రాసెను. శాస్త్రచర్చలో నజేయుఁడైన సుదుర్జయునిఁ గెలుచుటకు దిఙ్నాగునిఁ గాంచీపురము నుండి నాలందాపండితు లాహ్వానించిరి. యువాన్–చాంగ్ వలభీవిహారస్థాపకులైన గుణమతి స్థిరమతుల నాలందాపండితులుగఁ బేర్కొనెను. ధర్మపాలుఁడు కాంచీపురవాసి, పద్మసంభవుఁడు పశ్చిమోత్తరదేశాగతుఁడు. శీలభద్రుఁడు సమతాటదేశవాసి. రాజపుత్రుఁడు. ఇతఁడు భోగములఁ ద్యజించి సన్యసించెను.

## విక్రమశిలావిహారము.

ఉత్తరమగధదేశమున గంగాతీరమున నొకపర్వతమున విక్రమశిలావిహారమును ధర్మపాలుఁడు నిర్మించినట్లు తారానాథుఁడురచించినాఁడు ఈవిహారము నావరించి చక్కని ప్రాకారము గలదు. ఇందు నూటయెనిమిది దేవాలయము లుండెడివి. ఎందరో యాచార్యులు విద్యాప్రచారకులుగా నుండెడివారు. ఒకపరిషత్తు విద్యాప్రబోధమునుఁ బరిశీలించుచుండెడిది. ఈపరిషత్తే నాలందావిహార విద్యాబోధనలఁ గూడఁ బరిశీలించుచుండెడిది. దీనికిఁగారణము ధర్మపాలుఁడు రెంటికిఁగూడ ధర్మకర్తయగుటయే గావచ్చును. అందుచే దీపాంకరుఁడు అభయకరగుప్తుఁడు రెంటియందును విద్యాగురువులుగఁ బనిచేసినారు.

ఈప్రాకారమధ్యమున నొక కేంద్రవిజ్ఞానమండప ముం డెడిది. ఆమండపమున కారుద్వారములుగలవు. ప్రతిద్వార మున నూటయెనిమిది యుపాధ్యాయులుగల యొక కళాశాల యుండెడిది. ప్రధానవిహారకుడ్యమును నాగార్జునుని చిత్ర మలంకరించినది. వామకుడ్యమున నతీశుని చిత్ర ముండెడిది. ఆరుద్వారములందు "ద్వారపండితు"లుండెడివారు. వారు పాండిత్యద్వారపాలకులు. క్రీస్తుశకము 955—983 వరకు బరిపాలించిన చణకునికాలమున ద్వారపాలకులుగా నున్న యార్గురి తార్కికుల నామధేయములు నుపలభ్యములు.

| | |
|---|---|
| ౧ రత్నాకరశాంతి | తూర్పుద్వారము |
| ౨ వాగీశ్వరకీర్తి | (కాశీపండితుఁడు) |
| | పశ్చిమద్వారము |
| ౩ నరోపుఁడు | ఉత్తరద్వారము |
| ౪ ప్రజ్ఞాకరమతి | దక్షిణద్వారము |
| ౫ రత్నవజ్రుఁడు | (కాశ్మీరపండితుఁడు) |
| | ప్రథమసింహద్వారము |
| ౬ జ్ఞానశ్రీమిత్రుఁడు | గర్భద్వారము |
| | (గౌడదేశపండితుఁడు) |

ఈ విహారమున కధ్యక్షుఁడు కులపతి. ధర్మపాలుని కాలమున బుద్ధజ్ఞానపాదుఁడు. క్రీస్తుశకము 1034—1038.

దీపాంకుర శ్రీజ్ఞాన అతీశుఁడు—కులపతి, స్థవిరరత్నాకరుఁడతనికి యనుయాయుఁడై విహారమునుఁ బరిపాలించెను.

విక్రమశిలావిహార చరిత్ర మనకు విశదముగ లభించుటలేదు. నాలందావిహారమున యువాన్‌చంగ్, ఇట్సింగు లనేకసంవత్సరములు వసించి ప్రత్యక్షముగ దర్శించి వర్ణించినారు. అట్టి యాత్రికుల ప్రత్యేకవర్ణన విక్రమశిలావిహారమును గూర్చి నేటికిని లభింపలేదు. కాని విక్రమశిలావిహారవిద్యాస్నాతు లనేక దేశములచే నాహ్వానితులై యచ్చట విద్యాప్రబోధమునసలిపి విజ్ఞానపీఠముల నిర్మించిరి. తిబెట్టు దేశమునకు విజ్ఞానరేఖలఁ దీర్చిదిద్దినది విక్రమశిలావిద్యాస్నాతకులు.

జ్ఞానపాదుఁడు సింహభద్రుని శిష్యుఁడు. ధర్మపాలుని రాజపురోహితుఁడు. విక్రమశిలావిహారాచార్యుఁడు. ఇతఁడు తంత్రశాస్త్రమున రచించిన తొమ్మిదిగ్రంథములు తిబెట్టు భాషలోనే నిలిచియున్నవి.

వైరోచన రక్షితుఁడు: పద్మసంభవుని శిష్యుఁడు. గురువు తిబెట్టునకు వెళ్ళిన తరువాత శిష్యుఁడు విక్రమశిలా విహారముఁ జేరెను. బోధిసత్త్వచర్యావతార, పంజిక, రత్నవాదచక్రము — ఇత్యాది సంస్కృతగ్రంథముల రచించెను. వినయసంగ్రహ శుక్లవజ్రయోగినీసాధన లేక ప్రజ్ఞాపారమిత హృదయసాధన — ఇత్యాది సంస్కృతగ్రంథముల తిబెట్టు భాషలోని కనువదించెను. క్రీస్తుశకము 750 ప్రాంతమున

నతఁడు టిబెట్టునకు క్రి-స్రోఙ్-ఇదెబ్త్సన్ రాజుకాలమున వెళ్లెను.

జేతారిః సనాతనుఁడనురాజు కంచుకియైన గర్భాపాదుఁడను విప్రునిపుత్రుఁడు. క్రీస్తుశకము 899 — 940 సం॥ మధ్య వంగదేశమును బరిపాలించిన మహీపాలునిచేఁ బండిత బిరుదమునంది విక్రమశిలావిహారమున నాచార్యపీఠము నధివసించెను. క్రీస్తుశకము 983 ప్రాంతమున బండిత ద్వారపాలకుఁడైన రత్నాకరశాంతియు, దీపాంకుర అతీశుఁడును నితని శిష్యులే.

ప్రజ్ఞాకరమతి: ఇతఁ డొక పండితద్వారపాలకుఁడు ఇతఁడు రచించిన గ్రంథములలో రెండు టిబెట్టుభాషలో నున్నవి.

రత్నాకరశాంతి: ఇతఁ డొక పండితద్వారపాలకుఁడు. మొదట నోదంతపురీవిహారమున సర్వాస్తివాదనిష్ణాతుఁడై విక్రమశిలావిహారమున జేతారి శిష్యుఁడయ్యెను. సింహళాధీశుని యాహ్వానమున నచటికిబోయి బౌద్ధమును బ్రబోధించెను. అతఁడు సంస్కృతమున పదమూఁడు గ్రంథములను రచించెను. అందు వజ్రభైరవ గణచక్రనామ, శ్రీసర్వరహస్యనిబంధ రహస్యప్రదీపనామ — పేర్కొనఁ దగినవి.

జ్ఞానశ్రీ—జ్ఞానశ్రీమిత్రుఁడు మరియొక ద్వారపాలక పండితుఁడు. మొదట శ్రావకవాదము నభ్యసించి తరువాత

మహాయానమును స్వీకరించెను. అతఁడనేక సంస్కృతగ్రంథ ములు రచించెను. అందు ప్రమాణవినిశ్చయ టీక—తర్కభాష యను గ్రంథములు ముఖ్యములు. వీనిలో మొదటిది టిబెట్టు భాషలోనికిఁ గూడఁ బరివర్తితము.

రత్నవజ్రుఁడు కాశ్మీరపండితుఁడు. విక్రమశిలావిహార ద్వారపాలకపండితుఁడు. ముప్పదియారవయేటివరకు కాశ్మీర మున సూత్రములను శాస్త్రములను నభ్యసించి వజ్రాసన మును దర్శించి విక్రమశిలావిహారమున విద్యాభ్యాసముసల్పి 'పండిత' పదవి నధిష్ఠించెను. తిరిగి కాశ్మీరముఁజేరి కొందఱు తీర్థికులను వాదమున జయించి యుద్యానమునకుఁ బోయి తరువాత టిబెట్టు దేశమునఁ జేరి యాభాష నభ్యసించి పద మూడుగ్రంథముల భాషాంతరీకరణముఁ గావించెను. అందు 'మహామాయాసాధన' యొకటి.

వాగీశ్వరుఁడు: వారణాసివాస్తవ్యుఁడు. ఇతఁడు ద్వా రపాలక పండితుఁడు. తారాదేవీభక్తుఁడు. సంస్కృతమున మృత్యువంచనోపదేశమును రచించెను.

దీపాంకుర శ్రీజ్ఞానుఁడు : ఇతని నామాంతర మాచార్య యతీశుఁడు. విదేశములలో భారతసంస్కృతిని వ్యాపింపచేసిన ప్రచారకులలోఁ జిరస్మరణీయుఁడు. క్రీస్తుశకము 980 సంవ త్సరమున గౌడరాజవంశమునఁ జన్మించెను. అతఁడు రాజ భోగములఁ ద్యజించి పరివ్రాజకాశ్రమమును స్వీకరించెను.

ఈస్వీకారము కృష్ణగిరివిహారమున రాహులగుప్తుఁడను గురువునొద్ద జరిగెను. పందొమ్మిదవయేట నోదంతపురీవిహార మహాసాంఘికాచార్యుఁడైన శీలరక్షితునియొద్ద దీక్షనుబొంది దీపాంకుర శ్రీజ్ఞాననామమును గుర్వాదేశమున స్వీకరించెను. ముప్పదియొకటవయేట నాచార్యధర్మరక్షితునియొద్ద శిక్షా దీక్షనందెను. అతఁడు హీనయాన మహాయాన వైశేషిక తంత్రములందుఁ బండితుఁడు. విద్యాపూర్తియైనతోడనే సువర్ణద్వీపమునకు నౌకాయానమునఁజేరి (ప్రస్తుత పెగూలోని తాంటన్) ఆచార్యచంద్రకీర్తియొద్ద బౌద్ధమతమర్మములఁ గ్రహించెను.

అచ్చట పదిరెండు వత్సరములు విద్యనభ్యసించి సింహళముమీఁదుగా భారతదేశమునకుఁ దిరిగివచ్చెను. వజ్రాసనమున సమావేశమునఁ జేరిన యనేక తైర్థికులను వాదమునఁ జయించెను. రాజైన నయపాలుఁ డతనిపాండిత్యమును కీర్తిని విని విక్రమశిలావిహారమునకుఁ గులపతిఁజేసెను. ఆసమయమున టిబెట్టురాజు చాన్–చబ్. టిబెట్టుబౌద్ధమును నిష్కల్మషముగఁ జేయఁదలచి భారతదేశమున నిదివరకే సంస్కృతము నభ్యసించిన యొకరాయబారిని బంపెను. ఆదూత ప్రయాణప్రయాసలనోర్చి దీపాంకరుని సందర్శించి రాజాహ్వానమునందెను. దీపాంకరుఁడు "నాకు వృద్ధాప్యము వచ్చినది. ఇచ్చట నాకర్తవ్యము లనేకములు శేషించియున్నవి. ఈ సమయమున నేను రాలేను" అని బదులు పలికెను.

కాని క్రోంధికాలములోనే తారాదేవి యాదేశమున తిబెట్టునకుం బ్రస్థావింప నిశ్చయించుకొనెను. అతని సహాపాత్రులైన రత్నకీర్తి, వైరోచనుండు నేపాలువాస్తవ్యుండైన కనకశ్రీ దీనికి సమ్మతింపలేదు. విక్రమవిహారమువరకు నతనిని భూమిగర్భ, నాగతోస్సెగ్యాత్సన్, భూమిసంగ, వీరచంద్రు మున్నగు బండితులు సాగనంపిరి. తిబెట్టుంజేరంగనే స్వాగతగీతికలతో, మూడువందల యాశ్వికసైన్య మెదురేగి రాజునొద్దకతని దోడ్కొనిపోయిరి. అతండు తిబెట్టుబౌద్ధమును సంస్కరించి 'లామా' పద్ధతికి మార్గదర్శకుం డయ్యెను. క్రీస్తుశకము 1040-1053 వర కతండు కృషిసల్పెను. అతనిశిష్యుడు బ్రోమ్‌తన్ లామాపద్ధతికి మూలపురుషుం డయ్యెను. దీపాంకురుండు తిబెట్టులో ననేకగ్రంథములను రచించి ల్హాసా సమీపమునంగల నేతన్‌దగ్గఱ నిర్యాణముం జెందెను.

వీర్యసింహుండు: ఇతం డతీశునికి సహపాత్రుండై విక్రమశిలావిహారమున సంస్కృతగ్రంథములను తిబెట్టుభాషలోని కనువదించుటకుం దోడ్పడెను. అందు సంసారమనో నిర్ణయాణికారనామ, సంగీతికావ్యవాక్యచిత్త సుప్రతిష్టనామ యను గ్రంథములు ముఖ్యములు.

తిబెట్టుభాషలో నతీశుని యోగమనము మనోజ్ఞముగ నభివర్ణితము. అందు విక్రమశిలావిహారముం గూర్చిన విశేషములు స్వయంవ్యక్త మగుచున్నవి. తిబెట్టు భిక్షుకుండు,

నాగతోన్సరాజాదేశమున నతీశుని నాహ్వానించుటకు దూత నైమై విక్రమశిలావిహారద్వారముఁ జేరుసరికి సాయంసంధ్యా కాలమయ్యెను. అప్పుడు ద్వారము తెరుచుటకు వీలులేదు. ఆరాత్రి యతఁడు ప్రాకారప్రాంగణమునన్న ధర్మశాల యందు విశ్రమించెను. ప్రాతఃసంధ్యాకాలమున ద్వారము దెరువఁగనే యొక తిబెట్టు భిక్షుకు డాతని నందుఁగల తిబెట్టు విహారమందిరమున గ్యాత్సన్ అను వృద్ధభిక్షుకుఁ జతనిని విహారాధిపతియైన రత్నాకరుని శిష్యునిగా జేరమని చెప్పెను. అతీశుఁడు విజ్ఞానమున నధికుడైనను రత్నాకరుఁడే విహారాధి నేత. ఆమందిరము తిబెట్టునుండివచ్చు జిజ్ఞాసువుల ప్రత్యేకా వాసము. గ్యాత్సన్ "మన తిబెట్టుదేశీయులక్రిం దధికారప్రాభ వములు లేవు. కాని యతీశుని నేను స్వయముగా నెరుగు దును" అని చెప్పెను. మరునాడు విక్రమశిలావిహారమున సర్వభిక్షుసమావేశము. అందెనిమిదివేలమంది భిక్షుకులు గుమిగూడిరి. ప్రథమమున నధ్యక్షతవహించిన విద్యాకోకిల పండితుడు వచ్చెను. ప్రముఖభిక్షుకులకుఁ బ్రత్యేకస్థానము లున్నవి. మగధప్రభువు విక్రమశిలాపోషకుఁడైన రాజున కొక యున్నతాసన మేర్పరచిరి. కాని రాజాగమనమున భిక్షుకులెవ్వరు చిన్నలుఁగాని, పెద్దలుగాని లేచి నిలువలేదు. కాని వీరవజ్ర పండితుఁడువచ్చినప్పు డందరును, రాజుంతోఁ

గూడ నభ్యుత్థానము సలిపిరి. చిట్టచివరకు తాళపుజెవిగుత్తులు మెడలో వ్రేలాడ నతీశుఁడు వచ్చెను.

మరునాటి యుదయమున విహారమందిరమున తిబెట్టుదూత యతీశుని సందర్శించెను. అతఁడు బీదసాదల కన్నప్రదానముఁ జేయుచుండెను. అతీశుఁడు తనకొఱకు వ్యయప్రయాసలకోర్చి వచ్చిన తిబెట్టు దూత నభినందించి పదు నెనిమిదినెలలలోఁ దన కర్తవ్యములను నిర్వహించి వచ్చెదనని చెప్పెను.

అతీశుఁడు తన ప్రస్థానమునకు ముందు తనబాధ్యత లను విహారభిక్షుకుల కప్పగించెను. అతనికి మార్గదర్శకుఁడు, నాహ్వాతుఁడునైన నాగత్సో అతనిపరికరములు మూటలు గట్టించెను. వానిని ముప్పదియెద్దులు మోయవలసివచ్చినది. మార్గమధ్యమున నతఁడు వజ్రాసన, మిత్రవిహారము మున్న గు పవిత్రస్థలములను సందర్శించెను. నాలందావిహారము దగ్గర, సాగనంపుటకు వచ్చిన గ్యాత్సన్ జ్వరపీడితుఁడగుటచే నతని నొకడోలికలో విక్రమశిలావిహారమునకుఁ బంపించెను. తిబెట్టున కతని నాహ్వానించుసమయమున దక్షిణగా నారాజ కనకరాసులఁ బంపెను. ఆ ధనరాశినంతను త్యాగమూర్తి యైన యతీశుఁడు నాలుగుభాగములుగాఁ జేసి దానము సల్పెను. విక్రమశిలావిహారమునఁ దనకు విద్యాప్రబోధము

పల్పిన యాచార్యుల కొకభాగము, విహారమందలి భిక్షుకుల యుపయోగార్థము స్థావిరరత్నాకరునకు ధర్మకర్తగా నొక భాగము, వజ్రాసనమున మతప్రబోధమున కొకభాగమును దేశములో బౌద్ధసంఘారామములకు నాలుగవభాగమునుఁ బంచి యిచ్చెను.

అతీశుఁడు తిబెట్టునుఁ జేరగనే యతనికి జాతీయపానీయమైన తేనీరు నిచ్చిరి. భారతీయుఁడైన యతిథి కపరిచితమైన యాపానీయము నందించుచు తిబెట్టు భిక్షుకుఁడు "మహాశయా! దీనికి 'చా' అని పేరు. ఈ చా మొక్క-నెవ్వరైన భుజించెదరో మాకు తెలియదు. వేడినీటిలో దీని ఆకులఁ గలిపి వడగట్టి ఉప్పు, మజ్జిగలేక పాలుకలిపి దీనిని సేవించెదము. దీనికి బహులలక్షణములు గలవు" అని వచించెను. దీనినిఁబట్టి తిబెట్టునుండి తేనీరు భారతదేశమున కవరోహించినదని చెప్పవచ్చును.

అభ్యాకరగుప్తుఁడు : ఇతఁడు గౌడదేశవాసి, మగధ రాజు రామపాలుని రాజపురోహితుఁడు. క్రీస్తుశకము 1114 లో ననగా నతని పదమూడవరాజ్య సంవత్సరమున మునిమటాలంకారమును రచియించెను. అతఁడు విక్రమశిలావిహారమున శుభశ్రీ మహారాజు పోషణలో నుండెను. "ఆర్య మహాపండిత" బిరుదునంది యనేక గ్రంథముల రచించెను.

తథాగతరక్షితుఁడు : ఇతఁ డో్ద్రుఁడు, కాయస్థకుల జుఁడు. మహాపండితుఁడు. ఉపాధ్యాయుఁడు అనేక తార్కిక గ్రంథములను సంస్కృతమున రచించెను.

రత్నకీర్తి : ఇతఁడు గూడ టిబెట్టుభాషలో ననేక గ్రంథముల ననువదించెను. ధర్మవినిశ్చయప్రకరణనామ— ఇతని గ్రంథము.

మంజుశ్రీ : ఇతఁడు విక్రమశిలావిహార పండితుఁడు. తారాదేవీ భక్తుఁడు.

ధర్మకీర్తి : టిబెట్టువాస్తవ్యుఁడు. ఇతఁడు విక్రమ శిలావిహారమున సంస్కృతము నభ్యసించి పద్మసంభవుని "సమయపంచ" గ్రంథము ననువదించెను.

శాక్యశ్రీభద్రుఁడు : ఇతఁడు కాశ్మీరవాసి, తార్కికుఁ డు. ఇతఁడు ముస్లిములచే విక్రమశిలావిహార విధ్వంసనముఁ గన్నులార గాంచెను.

తబఖాత్ — ఇ — నాసలీ రచయిత విక్రమశిలావిహార విధ్వంసనమున వర్ణించెను. "అచ్చటి వాస్తవ్యులలో నధిక సంఖ్యాకులు బ్రాహ్మణులు. (భిక్షుకులు) ఈ బ్రాహ్మణు లం దరు ముండితశిరస్కులు. అందరు వధింపఁబడిరి. అచ్చట హిందువుల గ్రంథము లెన్నియో గలవు. ఆ పుస్తకములలో ని విశేషములఁ దెలిసికొనుటకు ముస్లిములు హిందువుల

నాహ్వానించిరి కాని హిందువులందరు సంహరింపబడిరి. చివర కా పుస్తకములలోని విషయములం బరిశీలింపగా నాకోట యొక విద్యాలయమని తేలినది. హిందువుల పరిభాషలో విద్యాలయము "విహారము." ఈ రచయిత హిందూ బౌద్ధ పదములకభేదము కల్పించి భ్రమించినాడు.

శ్రీభద్రుం డచటినుండి జగద్దలవిహారమునకుం దరువాత ననేకభిక్షుకులతోం గలిసి టిబెట్టునకు బౌద్ధమతప్రచారమునకుం దరలిపోయెను.

## మి థి ల

రామాయణకాలమునం జనకుని నాటినుండి మిథిలానగరము వేదాంతవిజ్ఞానపీఠముగా వినుతికెక్కినది. క్రీ. శ. 1150—1395 లమధ్య కర్ణాటకరాజవంశము, 1350—1515 మధ్య కామేశ్వరరాజవంశము మిథిలను బరిపాలించినవి. సర్వతోముఖప్రతిభగల జగద్ధరుండు కామేశ్వరరాజవంశపరిపాలనలో గీత, దేవీమాహాత్మ్య మేఘదూత గీతగోవింద, మాలతీమాధవనఘు — ఇత్యాదిగ్రంథములపై వ్యాఖ్యానములను రచించెను. మైథిలీగీతములను మధురగేయములల్లిన సుప్రసిద్ధకవి విద్యాపతి మిథిలవాండే. గంగేశవర్ధమాన, పక్షధర పండితోక్తమైన న్యాయశాస్త్ర మచ్చట క్రీ. శ. పండ్రెండునుండి పదునైదుశతాబ్దులమధ్య విలసిల్లినది. గంగే

శుని మూడువందలపుటల "తత్త్వచింతామణి" పై నొక పదిలక్షలపుటల వ్యాఖ్యానము మూడుశతాబ్దులలో బెరిగి నది.

గంగేశునికుమారుడు వర్ధమానుడు (క్రీ. శ. 1250) ఎనిమిది న్యాయగ్రంథముల రచించెను. పంద్రెండువందల డెబ్బదియైదవసంవత్సరములో బక్షధరుడు, నితని శిష్యుడు వాసుదేవమిశ్రుడు నీప్రకరణమున బేర్కొనదగినవారు. మహేశఠాకూరు గొప్ప తార్కికుడు. అతనిశిష్యుడు రఘునాథరాయలువాదములో దిగ్విజయమునంది యక్బరుసార్వభౌముని మెప్పించెను. అక్బరుచక్రవర్తి మిథిల నతనికి సమర్పించెను. రఘునాథరాయలు మహేశఠాకూరునకు దానిని గురుదక్షిణగా నర్పించెను. ఈవిధమున మహేశఠాకూరు నేటి దర్భాంగరాజవంశమునకు మూలపురుషుడు. శంకరమిశ్రుడు వైశేషిక న్యాయసూత్రములపై ననేక గ్రంథములను రచించెను.

క్రీ. శ. 1450 ప్రాంతమున వాచస్పతిమిశ్రుడు కామేశ్వరరాజోద్యోగిసభలో నుండెను. "న్యాయసూత్రోద్ధార" "ఖండన ఖండోద్ధార" "అనుమానఖండటీక" "నీతిచింతామణి" ఇవి యతని గ్రంథములు. ఇచ్చట శలాకాపరీక్షయను విచిత్రవిధాన ముండెడిది. సూదిమొనగుచ్చిలాగిన చివరి పుటపై వ్యాఖ్యానమునల్పిన యభ్యర్థికి "పండిత" బిరుదు

లభించెడిది. అనేకులు మిథిలకరిగి యానాడు విద్య నభ్యసించు చుండెడివారు.

మిథిల తర్కవిద్యలో ననన్యకీర్తి సంపాదించెను. పక్షధరమిశ్రుఁ డచ్చటఁ బేరుకెక్కిన తర్కవిద్వాంసుఁడు. గంగేశ ఉపాధ్యాయుని చింతామణి తర్కశాస్త్రగ్రంథమున కొక్క వ్రాతప్రతి మాత్రమే గలదు. అది మిథిలలో నుండెడిది. దాని ప్రతులు వ్రాయరాదని పక్షధరమిశ్రుఁడు శిష్యులందర కాజ్ఞాపించుచుండెడివాడు. ఆవిధముగ చింతామణి చదువగోరు తర్కవిద్యార్థులందరు తప్పనిసరిగ మిథిలకేగవలసి వచ్చెడిది. పక్షధరుఁడు తన యమూల్యవ్యాఖ్యానములకుఁగూడ శిష్యులను బ్రతులను వ్రాయనిచ్చెడివాడు గాడు. అట్లు తర్కవిద్యలో మిథిలా గౌరవప్రాముఖ్యముల పక్షధరుఁడు సంరక్షించుచుండెడివాడు. మిథిలా గౌరవము నవద్వీపమును జేరుటనుగూర్చి యొక మనోజ్ఞగాథ కలదు. వాసుదేవ సార్వభౌముఁడు కాశీలో నుపనిషత్తుల నభ్యసించి మిథిలానగరమును జేరి పక్షధరుని యొద్ద తర్కశాస్త్రము నభ్యసింపనారంభించెను. అతఁడు చింతామణిని వ్యాఖ్యానసహితముగా కంఠస్థమొనర్చి, నవద్వీపమును జేరి యచ్చట లిఖితప్రతి వినిర్మించెను. అప్పటినుండి తర్కశాస్త్ర విద్యాగౌరవము మిథిలనుండి నవద్వీపమునకుఁ దరలివచ్చినది.

వాసుదేవసార్వభౌముని యనూనుష ప్రతిభాశక్తి వలన తర్కవిజ్ఞాన భౌతికాంతరాయములను గడచి నవద్వీపమున ప్రచారముగాంచినది.

## వ ల భి

క్రీస్తుశకము 475 నుండి 775 వరకు వలభి మైత్రిక రాజులరాజధాని. రాజకుమారి దుడ్డాదేవి ప్రథమమున వలభీ విహారమును నిర్మించెను. ఆమె ధ్రువరాజుసోదరి. క్రీ. శ. 580 లో ధారాసేనుడు శ్రీ బప్పపాదవిహారమునకు దానశాసనముఁ గల్పించెను. దానిని యాచార్యభదంత స్థిరమతి నిర్మించెను. యువాన్‌చాంగ్ వలభీయందు కొన్నివందల సంఘారామముల నూఱువేలమంది భిక్షుకుల సందర్శించెను. నాల్గందా వలభీవిహారములు భారతదేశమున విద్యార్థులు రెండు లేక మూఁడు సంవత్సరములు విద్యాసంపూర్తికై నివసించెడువారని యిట్సింగ్ కథనము.

స్థిరమతి గుణమతి వలభీవిహారవాస్తవ్యులని యువాన్‌చాంగ్ వచించెను. క్రీ. శ. 559 లో గుహసేనరాజు దిన శాసనమును ("సద్ధర్మస్యపుస్తకో పరిచయార్థమ్") బట్టి యచ్చట నొకపెద్దపుస్తక భాండాగారము నుండెడిదని తెలియుచున్నది. వలభీవిహారమున విద్యనభ్యసించిన తరువాతఁ బండితులు రాజాస్థానములకుఁబోయి తమ విద్యావైదుష్యమునుఁ

బ్రదర్శించి రాజోద్యోగములను సంపాదించెడివారని యిత్సింగ్ వచించెను. కథాసరిత్సాగరమున నంతర్వేదినుండి వసుదత్తుఁడు కుమారుఁడైన విష్ణుదత్తునిఁ బదునాఱేండ్లు నిండఁగనే వలభీపురమునకు విద్యాప్రాప్తికొఱకుఁ బంపినట్లు గలదు.

## జగద్దల

క్రీస్తుశకము 1084 నుండి 1130 వరకు మగధదేశమునుఁ బరిపాలించిన రామపాలమహారాజు గంగాకరతోయా నదీతీరముల రామావతీనగరమును నిర్మించి జగద్దల విహారమును నిర్మించినట్లు రామచరితమను చారిత్రిక కావ్యమునఁ గలదు. క్రీ. శ. 1203 వ సంవత్సరమున ముస్లిము దండయాత్రచే విధ్వంసమగువరకు నీ విహారము సుమారు వంద సంవత్సరములు వర్ధిల్లినది. విజ్ఞాన వికాసమునకుఁ దోడ్పడిన చిరస్మరణీయులైన యీ విహార పండితులు పలువురు గలరు.

విభూతిచంద్రుఁడు : శాక్యశ్రీభద్రుని వలన "జ్ఞానచక్షుస్సాధన" యను గ్రంథము విభూతి చంద్రునికి లభించినది. ఇతఁడుఁ గూడ "టిబెట్టు" భాషలోఁ బండితుఁడు.

దానశీలుఁడు : టిబెట్టులోని యేబదినాలుగు గ్రంథములను ననువదించెను. ఇతని పేరు టిబెట్టు వాఙ్మయమున నుల్లిఖితము:

శుభాకరుఁడు : ఇతఁడు శాక్యశ్రీకి గురువు. సిద్ధైక వీరతంత్ర టీకను సంస్కృతమున రచించెను. ఇది టిబెట్టు భాషలోనికిఁ బరివర్తితము.

మోక్షాకరగుప్తుఁడు : తర్కశాస్త్రనిష్ణాతుఁడు. ఇతని "తర్కభాష" టిబెట్టు భాషలోనికి గూడ ననువాదరూపము నఁ గలదు. ఇతఁడు "మహాపండితభిక్షువు."

## ఒ ద ం త పు రి

అభ్యాకరగుప్తుని కాలమున నీ విహారమున వేయి మంది భిక్షుకు లిచ్చట వసించుచుండిరి. పేరెన్నికఁగన్న ప్రభాకరు డీ విహార వాస్తవ్యుడు క్రీ. శ. 749 లో శాంత రక్షితుని యుపదేశాను సారము టిబెట్టురాజు క్రీ-స్రోన్-డ్స్యూ-త్సన్ ఈ విహారము నొజ్జబంతిగా నిడుకొని ప్రథమవిహార మును "టిబెట్టు"లో నిర్మించెను.

## న వ ద్వీ ప ము

భాగీరథీ జాలంగీ నదీ సంగమమున నవద్వీపము కలదు. క్రీ. శ. 1063 న లేదా 1106 న గౌడదేశాధిపతి యైన లక్ష్మణసేనుఁడు దీనిని రాజధానిగఁ జేసెను. క్రీ. శ 1106—1138 వఱకుఁ బరిపాలించిన లక్ష్మణసేనుని యాస్థాన

మున ననేకపండితులుండిరి. అతని ప్రధానమంత్రి హలాయుధుఁడు. స్మృతిసర్వస్వమీమాంసా సర్వస్వన్యాయసర్వస్వములు రచించెను. గీతగోవిందమును రచించిన పద్మావతీచరణచారణ చక్రవర్తి జయదేవుఁడు పవనదూత రచించిన ధోయీ కవి, యమాపతిస్మృతి వివేకకర్తయైన శూలపాణి నవద్వీపమున వాసికెక్కినవారు.

క్రీ. శ. 1197 లో బఖ్తియార్ ఖిల్జీకి వెరచి లక్ష్మణసేనుఁడు తూర్పువంగమునకుఁ బాఱిపోవుటతో నారాజవంశమంతరించెను. న్యాయశాస్త్రమున నవద్వీపము కీర్తికెక్కినది. క్రీ. శ. 1450—1525 లలో వాసుదేవ సార్వభౌముఁడు మిథిలలో శలాకాపరీక్షలో నుత్తీర్ణుఁడై తత్త్వచింతామణిని, గనుమాంజలిని కంఠస్థ మొనరించెను. నవద్వీపమున వాదమున గెల్చినవారినే పండితులుగా నెన్నుచుండెడివారు.

రఘునాథశిరోమణి నవద్వీపతర్కశాస్త్రమునకు మూలపురుషుఁడు. ఈమధ్యవారిలో క్రీ. శ. 1570 నాటి మథురానాథునిఁ జేర్కొనవచ్చును. క్రీ. శ. 1680 లో రామభద్రుఁడు, జయరామ న్యాయపంచాననుఁడు, జగదీశ తర్కాలంకారుఁడు (శబ్దశక్తిప్రకాశికాకారుఁడు) గదాధరభట్టాచార్యుఁడు.

నవద్వీపములో ననేకులు పేరెన్నికఁగన్న విద్వాంసు లు వెలసిరి :

| | |
|---|---|
| హరిరామ తర్కసిద్ధాంతి | (1730) |
| రామనారాయణ తర్కపంచాననుడు | (1760 ప్రాంతము) |
| (బునో) రామనాథుఁడు | (1770) |
| కృష్ణకాంత విద్యావాగీశుఁడు | (1780) |
| శంకరతర్క నాగీశనుఁడు | (1800) |
| శివనాథ విద్యావాచస్పతి | (1810) |
| కాశీనాథచూడామణి | (1820) |
| శ్రీరామ శిరోమణి | (పదార్థతత్త్వకర్త) |
| దండి | (1830) |

నవద్వీప, శాంతిపుర, గోపాలపురములందు విద్యాల యములు గలవు. అందు నవద్వీపమునందు మాత్రము పదునో కండువందలమంది విద్యార్థులు, నూటయేబదిమంది యుపా ధ్యాయులు నుండెడివారు. క్రీ. శ. 1680 లో విద్యార్థుల సంఖ్య నాలుగువేలు. ఉపాధ్యాయులసంఖ్య యారువందలు. వీరందరు నున్నతవిద్య నభ్యసించినవారలే.

# ప్రాచీన భారత విశ్వ విద్యాలయములు



## దేవాలయ విద్యాలయములు

ప్రాచీనభారత దేశమున దేవాలయములు విద్యాలయములు. కళాపీఠములు. శిల్ప కేంద్రములు. సారస్వతము, శిల్పము, నృత్యము, చిత్రలేఖనము దేవాలయములలో విలసిల్లినవి.

దక్షిణభారత దేశములో దేవాలయములలో శాసనముల ననుశీలించినచో నీవిషయము సువ్యక్తము కాగలదు. ఇవిగాక మహారాజులు, రాజమంత్రులు, సంపన్నులు విద్యాభివృద్ధికై యగ్రహారములను, భూములను దానము సల్పెడువారు.

వేదములు, వ్యాకరణము, జ్యోతిషము, సాహిత్యము మీమాంస, ధర్మశాస్త్రము, పురాణములు, న్యాయశాస్త్రము, సంగీతనాట్యశిల్ప శాస్త్రము లానాటి యున్నతవిద్యలు.

సంస్కృతవిద్యయే యున్నతవిద్య. క్రీస్తుశకము 779 సంవత్సరమున రాష్ట్రకూటప్రభువు ధ్రువమహారాజు ధూలియా దానశాసనములో గృహీతలు వేద వేదాంగేతిహాస పురాణ వ్యాకరణ తర్కశాస్త్రములలోఁ బండితులు. ధార్వారుమండలములోని భుజగేశ్వరాలయములోని మఠమునకు క్రీ. శ. 975 సంవత్సరములో నేబది మత్తరుల (సుమారు రెండువందల యెకరములు గావచ్చును) భూదానము కలదు. ఆమఠములో విద్యార్థులకు విద్య యాహారము లుచితములు. దేవాలయములకిచ్చిన దానములలో నేతచ్ఛాయలనున్న విద్యానిలయములకు విద్యార్థులకు వారిపుస్తక వసతి భోజనాదులకై దానము లిచ్చుట ప్రాచీనాచారము. ధార్వారుమండలములోని కాలాస్ అగ్రహారములో నొక సంస్కృత విద్యాపీఠము కలదు. అందుఁగల రెండువందల బ్రాహ్మణ కుటుంబములు వ్యాకరణ నీతిశాస్త్రసాహిత్య పురాణవిద్యల నిష్ణాతులు. ఏకాక్షరతర్కశాస్త్రాభిజ్ఞులు. కొందఱు సుప్రసిద్ధ గ్రంథములకు భాష్యకారులు. రాష్ట్రకూటరాజు గోవిందుని దానశాసన మీయగ్రహారములోని విద్యాపీఠమందలి యుపాధ్యాయులకు వృత్తులను బ్రసాదించినది.

కృష్ణమహారాజు కాలమున బిజాపురీమండలములోని సలోత్గి యగ్రహారములో సంస్కృత విద్యాపీఠ ముండెడిది. త్రయీపురుషాలయమున నావిద్యానిలయము వర్ధిల్లినది. కృష్ణ

మహారాజమంత్రి నారాయణామాత్యుఁడా యాలయమును నిర్మించెను. దేశ దేశములనుండివచ్చు జిజ్ఞాసువుల వసతికై యిరువదియేడు భవనము లుండెడివి. పండ్రెండు నివర్తన ములభూమి (అరువది యెకరములు) దీపభోగమునకుఁ గావలసి వచ్చినది. 50 నివర్తనములు (250 ఎకరములు) కళాశాలా ధ్యక్షుని జీతము. 5,2½, 1½నాణెములుచొప్పున వివాహోపనయ నాదికములకు నీవిద్యానిలయమునకు సమర్పింప గ్రామస్థులలో నిర్ణయము. తరువాతిశతాబ్దిలో నొక సామంతరాజు కూలి పోయిన భవనములను దిరిగి నిర్మించెను.

రాజసభలు విద్యాకేంద్రములు. రాజు లాస్థానపండి తులను గౌరవించి విద్యాధికారులను నియమించుచుండెడి వారు. శ్రీనాథభట్ట మహాకవి రెడ్డిరాజుల యాస్థానమున విద్యాధికారి. కృష్ణరాయల యాస్థానమునఁ గవిపండితపరిష త్తుండెడిది. ఇట్లే రాజులు కృతికర్తలయి, కృతిభర్తలయి సారస్వతసేవ సల్పిరి.

ఎన్నాయిరం వేదవిద్యాశాల. క్రీస్తుశకము 1023 సం వత్సరమున రాజేంద్రచోళచక్రవర్తి కాలమున నొక శాసన ముదక్షిణ ఆర్కాటు జిల్లాలోని యెన్నాయిరం గ్రామమందలి వేదవిద్యానిలయమును బేర్కొనుచున్నది. అందు 340 విద్యా ర్థులుండిరి. ఋగ్వేదము 75 గురు, యజుర్వేదము 75 గురు, ఛాందోగ్యసామము 20 మంది, తలవకారసామము 20 మంది,

వాజసనేయము 20 మంది, యథర్వవేదము 10 మంది బోధా యనగృహ్యా, కల్ప, గణములు 10 మంది, వ్యాకరణము 25 మంది, ప్రభాకరమీమాంస 35 మంది, వేదాంతము 10 మంది యభ్యసించుచుండెడివారు. అందు పదిమంది యుపాధ్యాయు లుండిరి.

ఆ వేదవిద్యాలయమునకు 45 వేలులుభూమి (సుమారు 300 ఎకరములు) యున్నది. ఉపాధ్యాయునకు ఒకకలము ధాన్య ముదనబత్తెము. (కలము=12 కరుణి, ఒకపూట భోజనము ¾ కగుణి. కావున ఉపాధ్యాయునకు రోజునకుఁ బదునారు భోజనముల విలువగల బత్తెము గిట్టెడిది) అదిగాక సంవత్సరమున కతనికి ½ కలంజుబంగార మిచ్చెడివారు. వేదాంతోపాధ్యాయున కందఱికంటె నూటికి నిరువదియైదు పాళ్ళుసామ్మదనముగా నిచ్చెడివారు. వ్యాకరణోపాధ్యాయునకు నష్టాధ్యాయిలో నధ్యాయమునకొక కలంజుబంగరునాణెములభించెడిది.

పల్లవరాజు విజయనృపతుంగవర్మ తామ్రదానశాసనము మరియొక వేదవిద్యాశాలను పేర్కొనుచున్నది. అతఁడా విద్యాశాలకు మూడు గ్రామములను దాన మొనర్చెను. ఆ వేదవిద్యానిలయమున 14 ఘనములు, చతుర్వేదములు షడంగములు, మీమాంస, న్యాయపురాణధర్మ శాస్త్రములు గరపుచుండెడివారు.

క్రీస్తుశకము 1048 సంవత్సరమునాటి శాసనమున (176—1919 సం.) మరియొక విద్యానిలయమునుగూర్చి కలదు. అందు పండ్రెండుమంది యుపాధ్యాయులు. అందు ముగ్గురు ఋగ్వేదము, ముగ్గురు యజుర్వేదము, తక్కినవాని కొక్కొకరు చెప్పెడివారు.

వీరుగాక నేడుగురుపాధ్యాయులు శాస్త్రములను బోధించెడివారు. వేదాంతము, వ్యాకరణము, రూపావతారము, శ్రీభారతము, రామాయణము మనుధర్మశాస్త్రము వైఖానసమును బోధించెడివారు.

ఋగ్వేదము నరువదిమంది విద్యార్థులు, యజుర్వేదము నరువదిమంది, మిగిలినశాస్త్రముల డెబ్బదిమంది మొత్తము నూటతొంబదిమంది విద్యార్థు లభ్యసించెడివారు.

తిరువొత్రియూరు వ్యాకరణ విద్యాశాల —

తిరువెత్రియూరునందు వ్యాకరణ దానవ్యాఖ్యాన మండపనిర్మాణమునకు 60 వేలులు (సుమారు 410 ఎకరములు) దానభూమిని పేర్కొనుచు నొకశాసనము గలదు. (202—1912). ఆవ్యాకరణశాలకు నాభూమితో పాటింకను దానశాసనములు గలవు.

క్రీస్తుశకము 1062 సంవత్సరమున నొక సంపన్న వైశ్యుడు (182—1915 సం.) దానశాసనమున వేదములు,

శాస్త్రములు, రూపావతారము, బోధించు సంస్కృతవిద్యా నిలయము, విద్యార్థివసతిగృహము, వైద్యశాలను నిర్మించెను. విద్యార్థుల కుచితవసతి భోజనదీపభోగము లమర్పబడినవి. వైద్యశాలలో పదునైదు మంచములు, వైద్యుడు, మంత్రసాని, యౌషధకారులకు సేవకులకు భృతులుకల్పింపబడినవి.

క్రీస్తుశకము 1122 సంవత్సరమున గుంటూరు మండలములో మల్కాపురమున నొక శిలాశాసనమున (259—1905 సం.) దేవాలయమునకు నలుబదినాలుగుగ్రామముల దానము గలదు. ఈ దానమువలన నా దేవాలయమున కనుబంధముగ నొకమఠము, సత్రము, వైద్యశాల, ప్రసూతినిలయము నిర్మింపబడినవి. ముగ్గు రుపాధ్యాయులు వేదములను, నయిదుగురు తర్కసాహిత్యాగమములను చెప్పెడివారు. ఒకవైద్యుడు, కాయస్థుడు, సత్రమఠముల కార్గురు విప్రసేవకులు దానభూమివలన జీవించెడివారు. ఆసత్రమున సర్వవేళల విప్రులు మొదలు పంచముల వఱకు ననవరతాన్నప్రదానము జరుగుచుండెడిది

ఇవిగాక మహారాజులు విద్వాంసుల కగ్రహారములను వృత్తులుగ దానముచేసెడివారు. ప్రాచీనభారతచరిత్రలోనే రాజవంశచరిత్ర పఠించినను నిట్టి యగ్రహారదానము లనేకములు కల్పించును. క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దిలో శ్రీ రాజరాజనరేంద్రుడు నన్నయభట్ట మహాకవి కాంధ్ర

మహాభారతరచనలోఁ దోడ్పడిన నారాయణభట్టునకు నందం పూడి యగ్రహారమును దానమొనర్చెను.

ఈరాజాస్థానములందు విద్వత్ పరిషత్తు లుండెడివి. కవులు పండితులు క్రొత్తగ్రంథములను రచించినపుడు రాజ పరిషత్తులే మొదట వానిని విని యామోదించెడివి. రాజ రచయితను గౌరవించి, పుస్తకములకుఁ బ్రతులు వ్రాయిం చెడివాఁడు. ఇట్టిసంఘములు చాళుక్యులకాలమునఁ దెలుఁగు దేశములో నుండెడివని నన్నయమహాకవి తెలుఁగు భారత పీఠికలోఁగల పరిషత్ ప్రశస్తినిబట్టి యూహింపవచ్చును. ఇట్టి విద్వత్ పరిషత్తులు తమిళదేశమున నుండెనని చరిత్ర కారులు చెప్పుచున్నారు. ఆపరిషత్ యాజమాన్యమున నుద్భ విల్లిన గ్రంథసముదాయమునకుఁ దమిళమున సంఘవాఙ్మయ మని పేరు. ఆకాలమున రాజాస్థానములు, రాజవిద్వత్ పరి షత్తులు నేటి విశ్వకళాపరిషత్తులలోని యున్నతపరిశోధన, పుస్తకపరిరక్షణశాఖలవంటివి. భారతదేశమున జిజ్ఞాసు వా జన్మాంతవిద్యార్థి గనుక, అగ్రహారము లుత్తమవిద్వాంసుల కున్నతవిద్యాపరిశోధనలకై యివ్వబడిన శాశ్వతజీవితభృత్య ములు. నన్నయభట్టుమహాకవి తెలుఁగుదేశమే యుర్విలో ననఘమై శిష్టాగ్రహారభూయిష్ఠమైనదని ప్రశంసించినాడు. దీనినిబట్టి యాకాలమున నెన్ని యగ్రహారము లుండెడివో యూహించుకొనవచ్చును.

మైసూరునందలి వనవాసికి ముఖ్యపట్టణమైన బెల్గమి ప్రాచీనవిద్యాకేంద్రములలోఁ జెప్పఁకొనదగినది. శాతవాహన సామ్రాజ్యమునాటినుండి బనవాసికి విద్యాగౌరవము లభించినది. ఒక శాతవాహనరాజశాసనమున బ్రాహ్మణాగ్రహారదానము గలదు. తల్గుండాగ్రహారమున కదంబరాజు క్రీస్తుశకము మూడవశతాబ్దిలో 32 మంది ఉత్తరదేశ బ్రాహ్మణవిద్వాంసులకు వృత్తులు గల్పించెను. కదమరాజు మయూరవర్మకాలమున నాయగ్రహారమునకు 144 గ్రామములు చేఁనవి.

బేగూరున 1300 బ్రాహ్మణులకు సలిపిన దానశాసనము గలదు.

ఆ దానశాసనములలోఁ జతుర్వేదములు వేదాంగములు, మీమాంస, లోకాయత, బౌద్ధసాంఖ్యవైశేషిక, శాస్త్ర,స్మృతి, పురాణకావ్య నాటకాది విద్యలు ప్రస్తావింపబడినవి. బెల్గామి కోడీయ మఠాధిపతి, వామశక్తిపండితుఁడు "వ్యాకరణమున పాణిని, నాట్యమున భరతమునిని కవితలో సుబంధుఁడు మాఘుఁడు" అను ప్రశంస నాటి విద్యావైశద్యమును దెల్లమొనర్చును.

ధారాపురమును క్రీస్తుశకము 1018 నుండి 1060 వరకుఁ బరిపాలించిన భోజమహారాజు ప్రపంచసారస్వత చరిత్రలోఁ జిరస్మరణీయుఁడు. వాగ్దేవీమహాలయమున శిలా

శాసనము భోజనరేంద్రచంద్రుని పేర్కొనుచున్నది. క్రీ. శ. 1034 సంవత్సరము నాటిదాశాసనము. సూత్రధార సహిర పుత్రుఁడు మంతలుఁడు శిల్పి.

వాగ్దేవివిగ్రహము జగన్మోహనశిల్పము. భోజుని వంటి మహారాజొక్క డొక్కఁడే యొక విశ్వవిద్యాలయమని మైశిష్ట్యము నురిపించి చెప్పుకొనుచున్న కమ్మనికథలవలన నూహింపవచ్చును. ధారాపురమందలి విద్యాలయములు, భోజరాజాస్థాన కవిపండితపరిషత్తు జగద్విఖ్యాతములు.

నన్నెచోడమహాకవి, చాళుక్యరాజులు "మునుమార్గ కవితదేశంబున వెలయగ దేశికవిత బుట్టించిర"ని వ్రాసెను. రాజాస్థానములన్నియు విద్యాకేంద్రములు. ఆస్థానవిద్వాంసులకు విశేషప్రాముఖ్య ముండెడిది. నన్నయ రాజరాజ నరేంద్రుని కులబ్రాహ్మణుఁడు. బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుఁడు. మహాకవి. అతని సహాధ్యాయి నారాయణ భట్టు అష్టాదశావధారణ చక్రవర్తి. పైశాచికాది భాషాకో విదుఁడు.

రాజాశ్రయమున నభివృద్ధినంది, విశ్వవిఖ్యాతిగన్న కళలలో భారతీయచిత్రకళ యొకటి. ప్రాచీనసంస్కృత కావ్యములం దీచిత్రలేఖనముగూర్చి యనేక ప్రస్తావనలుగలవు. గైరికాదిధాతువులతో రంగులనుగలిపి చిత్రములు వ్రాయుటనుగూర్చి పలుప్రశంసలు కనిపించుచున్నవి. ఈచిత్రకళకు

గూడ శిల్పనాట్యకళలకువలె దేవాలయము లాశ్రియ మిచ్చి నవి. దేవాలయమవిన విగ్రహమునకెంత ప్రాముఖ్యమో శిల్పనిర్మాణమున కంతప్రాముఖ్యము. దేవాలయ ధ్వజస్తంభ మందలి చిరుగంటలమ్రోతకు శ్రుతిగల్పుకొని నర్తకీకింకిణీ రావములు నినదించినవి. అచ్చట కామవికారమునకుఁ జోటు లేదు. శిల్పనృత్యకళలతోపాటు చిత్రలేఖనము దేవాలయ కుడ్యాల నధిరోహించినది. ప్రాచీన దేవాలయములు లలిత కళానికేతనములు. లేపాక్షి దేవాలయ కుడ్యములలోని చిత్ర లేఖనముల నుదాహరణముగ స్వీకరింపవచ్చును. ఈ చిత్ర లేఖనము కాలగర్భమున గలిసిపోయినది. కాని, యింకను ప్రాచీన కళావశేషములు కొన్ని లేకపోలేదు. జగద్విఖ్యాతి గన్న యజంతా చిత్రలేఖనములు ప్రాచీనభారతీయ చిత్ర లేఖన వైశిష్ట్యమునకు నేటికిని మెరుగుమాయని స్ఫటికశిలా స్నిగ్ధహర్మ్యములు. ఆవెలుఁగునీడలు, చిత్రవర్ణసమ్మేళనము, రేఖావిన్యాసము శతాబ్దులు మెరుగుతరుగని పవిత్యగాత — భారతీయ చిత్రకళ ప్రపంచమున నద్వితీయ మనన్యమని నిరూపించినవి. జపాను చీనాదేశములలోని పర్వతగుహాభ్యంత రములు భారతీయ చిత్రకళకు గురుదక్షిణ చెల్లించినవి.

# ప్రాచీన భారత విశ్వవిద్యాలయములు.

## విదేశములలో ప్రాచీన భారత విజ్ఞాన ప్రచారకులు.

ప్రాచీన భారతవిద్వాంసులు చీనా దేశమున కళింగ, సుమిత్రా ద్వీపసమూహాములలో చంపా సువర్ణ ద్వీపకల్పాలలో సాగించిన విజ్ఞాన దిగ్విజయయాత్ర ప్రపంచ చరిత్రలో నత్యద్భుత ఘట్టము. క్రీస్తుశకారంభమునుండి సహస్ర సంవత్సరములు భారతీయపండితులు చీనా మున్నగు విదేశముల కేగి పూజాపీఠముల నధిష్ఠించి విజ్ఞాన ప్రచార మొనర్చిరి.

భారతీయ విజ్ఞాన దిగ్విజయయాత్ర అశోకచక్రవర్తితో నారంభించినది. రాజపురుషులు, రాజకాంతలు, పండితులు బుద్ధభగవానుని దివ్యసందేశముతో పాటు, సంస్కృతి పారస్వత విజ్ఞానమును, భారతీయశిల్పమును దేశదేశములం బ్రతిష్ఠించిరి. ఆనాడే చీనాకు నిరుగుపొరుగు దేశాలకు భారత

దేశమునకు రాకపోకలు వాణిజ్యసంబంధము మిక్కిలి సన్నిహితముగా నుండెడి వనుటకుఁ బ్రబల చారిత్రిక నిదర్శనములు గలవు. చీనాకు భారతదేశమునకు నాటుదారిని, నీటిదారిని గూడ నీ విజ్ఞాన వ్యాపారానుబంధము సాగుచుండెడిది. ఉన్నత హిమాలయ పర్వతపంక్తుల న ధి గ మిం చి, గోబీయెడారిని దాఁటి, భీకరారణ్యములను మహానదుల నతిక్రమించి, య మానుష ప్రయాసలకోర్చి భారతీయ పండితులు చీనాను చేరు చుండెడివారు. చీనీయులు తీర్థయాత్రికులై యచ్చటి బుద్ధభగ వానుని పవిత్రభూమిని సందర్శించుటకై సంస్కృత విజ్ఞానము నాకళించుకొనుటకై వచ్చుచుండెడివారు. మార్గమధ్యమున జిజ్ఞాసువులెందరో మరణించిరి. ఒకసారి నూటికి తొంబది మంది మరణించిరి. సముద్రమార్గము, తామ్రలిప్తి రేవులనుండి, తామ్రపర్ణి, సింహళము, చంపా, యవ సుమిత్రా ద్వీప ముల మీఁదుగఁ జీనాచేరుట. సముద్రమార్గము గూడ నపా యగర్భితముగనే యుండెడిది. క్రీస్తుశక మూఁడవశతాబ్దిలోఁ జీనాలో నొక్క లోయాంగ్ రాష్ట్రమందు మాత్రమే పది వేల భారతీయ గృహస్థు లున్నట్లు చెప్పబడినది. భారతీయ పండితులు సంస్కృత గ్రంథముల వ్రాతప్రతులతోఁ జీనా దేశము చేరుట. అచ్చట వారికి చక్రవర్తి ప్రజలు స్వాగత మిచ్చి పూజాగౌరవము లర్పించి మన్నించుట, వారు చీనా భాషలోనికి సంస్కృత గ్రంథముల ననువదించుట,- ఇది వేయి

సంవత్సరములు జరిగిన యద్భుతగాథ. భారతీయులు విదేశములపై రాజ్యాకాంక్షతో దండెత్తిన సన్నివేశము చరిత్రలో మృగ్యము. కాని భారతీయపండితులు దేశ దేశములలో విజ్ఞానదండయాత్రలు సలిపిరి. వారు చేపట్టినది కత్తి కాదు; ఘంటము. దేశమును రక్తరసప్లావిత మొనర్పలేదు. జ్ఞానరాగరసప్లుత మొనర్చినారు. వారు సామ్రాజ్యముల నేలలేదు. ఎల్ల మానవహృదయముల నేలుకొనిరి.

భారతీయ సంస్కృతి నవగాహన మొనర్చుకొనుటకు జిజ్ఞాసువు ప్రాచీనసహాయ సీమలలో స్వచ్ఛందవైర్థికుడు గావలెను. ఒకనాడాసియాఖండమున కంతకు భారతభూమి దీపస్తంభమై వాసికెక్కినది. ఈ సందర్భమున సర్. చార్లెసు ఇలియట్ వాక్యములు చేర్చుకొనదగినవి. "పశ్చిమ చరిత్రరచనలో హిందూదేశమున కన్యాయము జరిగినది. యూరపు వాస్తవ్యుల దృష్టిలో భారతీయులు సముద్రములు, పర్వతముల మధ్య పగటికలలు కనుచు కాలము గడిపిన నిర్భాగ్యులు, యూరపు వాస్తవ్యులు విశ్వవిజిగీషువులు. ఇట్టి చిత్రణము హిందువుల విజ్ఞానవిశ్వదిగ్విజయమును మరచుచున్నది.

హిందువుల పరాక్రమ ప్రాభవములు, వీరత్వము గణనీయములే. వారి ప్రాచీనవాణిజ్య నాగరకతాదీప్తి, విజ్ఞానవ్యాప్తి యనన్యము."

చీనా, జావా, సుమిత్రా, బోర్నియో, చంపా, కంబోడియా, అంగిర్, శ్రీవిజయ, మజపహిల్ పేరులు ప్రాచీన భారతీయ విజ్ఞాన వికాసమును ఇంద్రజాలమువలె మన కనులకు కట్టును.

క్రీస్తు శకము మొదటి శతాబ్దివాఁడు 'పాన్—కా' అను ప్రాచీన చీనారచయిత దక్షిణాపథమునకు చీనాదేశమునకు క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దినుండి క్రీస్తుశకము మొదటి శతాబ్దివరకుఁ గల వ్యాపార సంబంధములను పేర్కొనెను. "జీనన్ ద్వారములనుండి (ఉత్తరగన్నాము) యైదు నెలలు నావలో ప్రయాణముఁజేసిన తాన్-యువాన్ రాజ్యమును జేరవచ్చును. మరి నాలుగు నెలల తర్వాత ఐ—శా—మో. యిరువది రోజుల తరువాత బెన్-బి రాజ్యము, అక్కడనుండి పదిరోజులు నేలమీఁద పయనించిన పౌ-కన్—టూ—లా జేరవచ్చును. అక్కడనుండి రెండు నెలలు సముద్రప్రయాణముఁ జేసిన హాంగ్—చీ రాజ్యము (కాంచీ) జేరవచ్చును. ఈరాజ్యములు జనసమ్మర్దముగల దేశములు. 'లా' చక్రవర్తికాలము నుండియు 140-86 క్రీస్తుపూర్వమీ రాజ్యములనుండి చీనాకు సరుకులు చేరుచున్నవి. రాజప్రాసారమునకుఁ జెందిన ద్విభాషులు నావికులతో గలిసి యీదేశములకుఁబోయి బంగారమును, చీనాంబరములను నిచ్చి, పగడములు, వైడూర్యములు, రత్నములు గొనుచుందురు. వీరిని విదేశనావికులు

తమ నావలలో పై క్రమమున చీనాదేశమున దింపుదురు. సముద్రయానమున తుఫాను భయంకరమైనది. యువాన్–చే చక్రవర్తి (క్రీ. శ. 1–6) చీనానుండి కాంచీరాజునకు కానుకలఁ బంపెను. 'హంగ్–చీ' రాజ్యమునుండి యెనిమిదినెలలు సముద్రయానమున పీ–చింగ్ (మలయా ద్వీపకల్పమునకు పశ్చిమముననున్న) ద్వీపమును జేరుదుము."

ఖారవేలుఁడు క్రీ. పూ. 170 సంవత్సర ప్రాంతమున బౌద్ధభిక్షుకులకు చీనాంబరములను ఒహూకరించెను. కాళిదాసు పతాకముగా నెగురుచున్న చీనాంశుకమునుఁ బేర్కొనెను. నాగార్జునుని ప్రజ్ఞామూలశాస్త్రము చీనాభాసలలోనికి క్రీ. శ. 196–221 మధ్య హ్యూ–కన్ అనువదించినాఁడు. పాహియాన్, యువాన్‌చాంగ్, ఇట్సింగ్, సాంగ్ అను సుప్రసిద్ధయాత్రికులు భారతదేశమునకు వచ్చిరి పాహియాన్ తామ్రపర్ణి (సింహాళ) ద్వీపములో నోడనెక్కి చీనాదేశమునకు మరలినాఁడు.

'టోలిమీ' భారతదేశమున కిరుగుపొరుగున గల దేశముల బేర్కొనినాడు. ఆ దేశముల నామములు, నందలి పట్టణములు, వర్తకవ్యాపారవిశేషములు, నాదేశమునకు భారత దేశమునకు, నందును దక్షిణాపథమునకు, నాంధ్ర కళింగ దేశములకును గల ప్రాచీనానుబంధములను స్వయం వ్యక్తముఁ జేయుచున్నవి. అర–కాన్ రాజధాని త్రిలింగ

కాకుళ మొకపట్టణము. ఈ నామముల నాంధ్రనావికులు ప్రాచీనకాలమున దమ యభినివేశముల కాప్యాయముతోఁ బెట్టిన పేర్లు. బర్మాలో దక్షిణాపథవాసులు నిర్మించిన యధినివేశరాజ్యములు క్రీస్తుపూర్వ మేడవశతాబ్దినుండియుఁ గలవని కలనల్ గెరినీ యభిప్రాయము. పాండురంగ అమరావతి, విజయ, కాతార, తక్కోలా, లిగరు, సింహాపురము, కళింగ, భోజ—ఇత్యాది నామములు ప్రాచీన భారతదేశములోని నామములకుఁ బ్రతిబింబములు. జావాద్వీపమునకుఁ బ్రాచీన నామము కళింగద్వీపము, నేటికిని జావా, బోర్నియో దేశములలోని ప్రాచీన శిలలు పర్వతగుహాలు, బుద్ధమూర్తులు, వాని యాంధ్రసంస్కృతికి వానికిఁగల పూర్వానుబంధములకు మహానముగా సాక్ష్యమిచ్చుచున్నవి. ప్రాచ్యదేశములకు దక్షిణభారతదేశమునకుఁ గల యీసంబంధము ప్రాచీన కాలమున పండ్రెండవ శతాబ్దివరకుఁ గూడ సాగినది. 'శక్తివర్మన్' రాజరాజు తూర్పు చాళుక్యరాజుల నాణెములరకాన్ సయాములలో దొరికినవి.

## బర్మా

బర్మాలో పెగూతీరమునకు కళింగమని పేరు. పశ్చిమోత్తరకళింగమున కుత్కళమని పేరు. కాళిదాసు కళింగాధిపతి సముద్రాధినాథుఁడని పేర్కొనెను. కృష్ణా గోదావరీ

ముఖములనుండి వచ్చిన ప్రాచీనవాసులఁ గురించిన మైతి హ్యము పెగులోనున్నట్లు పయిరె చెప్పుచున్నాఁడు. బర్మాలోనున్న తైలింగులు తెలుఁగువారి సంతతియని యీగ్రంథ కర్త యభిప్రాయము. టోలిమీ పేర్కొనిన త్రిల్లింగన్, లేక త్రిగ్లిప్టన్ కూడ తెలుఁగునకు సంబంధించినదే. గోదావరీ మహానదీ మధ్యదేశమున నాంధ్రదేశ మిమిడియున్నది. కాలక్రమమున త్రికళింగ త్రికలింగ, త్రిలింగ, తెలింగ, తెలుంగు, తెలుగుగా మారినది బాణుఁ డాంధ్రరాజులను త్రిసముద్రాధిపతులని వర్ణించినాఁడు. ఆంధ్రశాతవాహనుల నాణెములపై రెండు తెరచాపల నావ బొమ్మయున్నది. ఒక ప్రత్యక్ష ప్రాచీన నిదర్శనము లిపి.

ప్రాచీన తైలంగ్ లిపి యక్షరములు నాలుగవశాతాబ్ది వేగిలిపి యక్షరములు సమానములే. ఇంతేకాదు. ప్రోము (బర్మా) మండలమున నొక శాసనములో లిపి దక్షిణాపథలిపి. ప్రోములో నొక ప్రాచీనస్థూపము బయలు వెడలినది. స్థూపాగ్రభాగమున ప్యూ, పాలి, భాషామిశ్రితమైన లిపి ప్రాచీన తెలుఁగులిపి. సన్నని బంగారురేకులపై ధర్మసూత్రములు పాళిభాషలోఁ గలవు. ఈ లిపి కూడ ప్రాచీన దక్షిణాపథ లిపియే. బుద్ధఘోషుఁడు సింహళమునుండి బర్మాదేశమునకు వెళ్లి బౌద్ధమతగ్రంథముల ప్రచారము సల్పెను. బుద్ధఘోషుఁడు బుద్ధదత్తుఁడు, తైలింగరాజు సన్-లన్-క్రోమ్ సమకాలి

కలు. ఈ తైలంగరాజు బౌద్ధమతమును బర్మాలో బ్రవేశ పెట్టెను. బుద్ధదత్తుని వేంగీరాజాహ్వానించి వేంగీరాజ్యమునకు రప్పించుకొనెను. ఈ తైలంగరాజు వేంగినిఁ బరిపాలించిన శాలంకాయన వంశీయుఁడు.

ప్రాచీనకాలమునఁ బ్రాచ్యదేశమునకు, నాంధ్రనాకల వ్యాపారసంబంధానుబంధములు పెంపొందించినది. ఈ వర్తకనాకలలో నాంధ్రశిల్పులు, మతాచార్యులుఁగూడ బయలుదేరి సుమిత్ర, బోర్నియోద్వీపములలో బర్మాదేశములో గుహాలలో బుద్ధభగవానునిఁ బ్రతిష్ఠించి పాషాణములకుఁ జీవకళలుబోసి ప్రతిమలకుఁ బ్రాణప్రతిష్ఠఁజేసి స్వర్గలోకముగా తీర్చిదిద్దిరి. అమరావతిని ప్రాచ్యబర్మారంగమున పునఃప్రతిష్ఠించిరి.

## మలయద్వీపకల్పము : చంపారాజ్యము

ప్రాచీనకాలమున చీనానుండి హిందూదేశమునకు సముద్రయానమున మలయాద్వీపకల్పమొక మజిలీగా పాన్ క్రా పేర్కొనినాఁడు. దీనినిఁ బ్రాచీనులు సువర్ణభూమియని వ్యవహరించిరి. ఇచ్చటి ప్రాచీనవిగ్రహములలో భారతీయకళ ప్రతిబింబించుచున్నది. ప్రస్తుత మిండో చీనాదేశమును బ్రాచీన కాలమున నమరావతి విజయపాండురంగ రాష్ట్రములు, మూడవశతాబ్దికిఁ జెందిన శిలాశాసనములోని యక్షరములు

వాశిష్టపుత్రశతకర్ణి కాస్త్మీరి యక్షరమునుఁ బోలుచున్నవి. ఈలిపి లిమాంధ్రకళింగములనుండి "చంప" దేశమునకు జేరియుం డును. ఇండో — చీనా దేశమున లిపి ప్రాచీనదక్షిణాపథలిపిఁ బోలియున్నది. భద్రవర్మ మహారాజు నాలుఁగు వేదములను జదివినాఁడు. అతఁడు ధర్మమహారాజు, పల్లవరాజులను నిట్టి బిరుదమునే వహించి చంద్రవర్మ హిందూదేశమునకు రాయ బారమునంపెను. చంపారాజులు "ఇంద్రవర్మ, దేవవర్మ, జయవర్మ"— ఇత్యాదినామములు వేంగీరాజులు నామములే. చంపారాజ్యములోని శాసనములన్నియు సంస్కృత భాషలో నున్నవి. అర్వాచీనశాసనములో శాలివాహన శకము ప్రయుక్తము.

## ద్వీ ప ము లు.

### సింహళము :

సింహళద్వీపమునకు భారత దేశమునకు, నందు నాం ధ్ర దేశమునకు చరిత్రలో పురాణబంధములుఁ గలవు. ప్రాచీన కాలమున దేశాంతరములకు ప్రాకినది బౌద్ధసంస్కారము. బుద్ధునిధాతువు లమరావతి స్తూపములో నాగార్జునకొండమహా చైత్యములో నిక్షిప్తమయినవి. నాగార్జునకొండయొద్ద విహా రమున సింహళభిక్షుకుల కొకవిహారమున్నది. ఈ భిక్షుకులు కాశ్మీర, గాంధార, చీనా, తోసలి, యపరాంతవంగ, వన వాస, యవన, ద్రమిళ, సింహళదేశీయులకు బౌద్ధదీక్షనిచ్చి

నట్లు శిలాశాసనముఁ గలదు. సింహళదేశమునుండి యేనుఁ గులు దక్షిణాపథమునకుఁ బ్రత్యేకనావలలో నెగుమతియగు చుండెడివని చంద్రగుప్తుని యాస్థానము గ్రీకురాయబారి వచించినాఁడు. దత్తగ్రామణి యాంధ్రదేశమునుండి సంపా దించిన బౌద్ధధాతువునకు మహాస్తూపమును సింహళములోఁ గట్టించెను. ఆమహోత్సవమునకు మహాదేవునితో వేనకు వేలు బౌద్ధభిక్షుకులు పల్లవబొగ్గనుండి వచ్చిరి. పల్లవబొగ్గ గుంటూరు మండలములోని పల్లవనాడు—పలనాడునకు ప్రాచీ నరూపము— సింహళములో నుండవల్లి, గుహాలవంటి పర్వతా లయములు గలవు.

నాగార్జునాచార్యులువారి శిష్యులు, సింహళములో కొంతకాలము వసించిరి. సుమిత్ర, యవ, బోర్నియో, మధుర ద్వీపములు నాంధ్రభూమితోగల సంబంధము పురాప్రసిద్ధము. యవద్వీపములోని బరోబదూరుశిల్పములు, స్థూపమునాంధ్ర దేశములోని యమరావతీ సంఘారామస్థూపములకు ప్రతి నిధులు. బరోబదూరులో మహాపర్వత పాషాణముల స్వర్గసౌం దర్యముల ప్రతిష్ఠించిన శిల్పులు ప్రతిభ వర్ణనాతీతము. చరి త్రలో ప్రాచ్య ద్వీపద్వీపకల్పములకు నాంధ్రదేశమునకుఁగల పురాను బంధములఁగురించి కావ్యములకన్న బరోబదూరు శిల్పములే యెక్కువగా తెలుపఁగలవు. శిలాప్రతిమలకు మూ టలువచ్చిన బరోబదూరు పర్వత పాషాణ శిలాప్రతిమలు చరి

త్రకారుని కంటె సుందరముగా ప్రాచీనాంధ్ర శిల్పకళోన్నతిని-ప్రాచ్యదేశపురానుబంధనములను ప్రపంచమునకుఁ జాటి చెప్పగలవు. యవద్వీపమునకుఁ బ్రాచీననామము కళింగ ద్వీపము. జావాశిలాశాసనముల లిపి పల్లవలిపి. జావాశాసనములలోని పూర్ణవర్మన్, బోర్నియోశాసనములలో మూలవర్మన్, పల్లవ వంశీయులనియేఁ జెప్పవచ్చును. ఆ శిల్పములలోని ద్వారపాలకులు, తోరణములోని తీరుతీయములు, పల్లవ శిల్పప్రభావమును స్వయంవ్యక్తముఁ జేయుచున్నవి. జావా ద్వీపములోని యర్వాచీనరాజులు శాలివాహన శకమునుఁ బ్రయోగించిరి.

క్రీస్తుశకము నాలుగవ శతాబ్దిలో ఈ ద్వీపములలో బౌద్ధమతము పాహియాన్ వాక్యముల ననుసరించి క్షీణదశనుఁ బట్టినదని చెప్పవచ్చును. తరువాతి శతాబ్దిలో పూర్ణవర్మక్ హింసా మతావలంబి యని శాసనములు దెల్పుచున్నవి. ఏడవశతాబ్దిలో నీ ద్వీపములో నిట్సింగ్ బౌద్ధమత ప్రాభవమును బ్రస్తుతించెను. మూలవర్మ శిలాశాసనాక్షరములఁబట్టి నామమును బట్టి యతఁడు పల్లవ వంశీయుఁడని చెప్పవచ్చును. అతని శిలా శాసనముఁబట్టి సుమిత్రలోని "ఆదిరాజు" "ఆదిత్యధర్ముఁడు" ఏడంతస్థుల బౌద్ధవిహారమును గట్టించెను. ఈద్వీపములోని బుద్ధప్రతిమ లమరావతీ బుద్ధ ప్రతిమలఁ బోలుచున్నవి.

# చీనా

క్రీస్తు పూర్వము 98-75 సంవత్సరముల మధ్య చీనాను బరిపాలించిన చక్రవర్తి మింగ్-తి-బౌద్ధాభిమానియై పదునెనిమిదిమంది రాయబారులను భారతదేశమునకుఁ బంపెను. వారు బౌద్ధమత పవిత్రగ్రంథములతో, బ్రతిమలతో "కాశ్యపమాతంగ" "ధర్మరత్న" భిక్షుకులతో చీనాకు మరలివచ్చిరి. కాశ్యపమాతంగుఁడు మధ్యభారతవాస్తవ్యుఁడు. బ్రాహ్మణుఁడు. చీనారాయబారు లాహ్వానించు సమయమున నతఁడు గాంధారమున నుండెను. ఇతఁడు, నితని సహపాత్రుఁడునుఁ బ్రయాణ ప్రయాసలకోర్చి యున్నత పర్వతశిఖరములుఁదాటి, గోబీయెడారి నధిగమించి యెట్టకేలకు 'చీనా' చేరిరి. విజ్ఞాన దిగ్విజయ యాత్రికులై వీరిమార్గము ననుసరించిన భారతీయు లసంఖ్యాకులు.

క్రీస్తుశకము మొదటి మూడు శతాబ్దులలోఁ జీనాలో విజ్ఞానవ్యాప్తి సలిపిన భారతీయ విద్వాంసులలో సంఘవర్మ ధర్మసత్య ధర్మకాల, మహాబల కాలశిబి (క్రీ. శ. 255) కాలరుచి (క్రీ. శ. 281) లోకరక్షపండితులు పేర్కొనఁదగినవారు. క్రీ. శ. 207వ సంవత్సరమున ధర్మపాలుఁడు కపిలవస్తునగరి నుండి తెచ్చిన సంస్కృత గ్రంథమును చీనా భాషలోని కనువదించెను. "ప్రాతిమోక్ష"ము క్రీ. శ. 224 లో

వినయసూత్రమును చీనీయులకు కెరిగించుటకు ధర్మ పాలుడు భాషాంతరీకరించెను.

తరువాతి పురుషాంతరములోఁ జీనాలోని భారతీయ విద్వాంసులలో ధర్మరక్ష గౌతమసంఘదేవ, బుద్ధభద్ర, సంఘభూతి, ధర్మప్రియ, కుమారజీవ, విమలాక్ష, పుణ్యత్రాత పండితులు ప్రముఖులు. క్రీ. శ. 318 సంవత్సరము నుండి ధర్మరక్షపండితుఁడు ముప్పదియారు భాషల నేర్చి చీనా భాషలో బ్రవీణుఁడై బ్రాహ్మణ్యఫల సూత్రము మున్నగు నూటపదునొకండు గ్రంథముల ననువదించెను. కాశ్మీర దేశస్థుఁడు గౌతముఁడు క్రీస్తుశకము 283 ప్రాంతములలో చీనాభాషలోనికి మధ్యమాగమ, అధి ధర్మహృదయ శాస్త్రముమున్నగు నేడు గ్రంథముల ననువదించెను.

కుమారజీవుఁడు రాజామాత్య పుత్రుఁడు. అతని తండ్రి కచ్ఛరాజపుత్రికను వివాహమాడెను. అతఁడు తొమ్మిదవయేట కాశ్మీరమున నాచార్యబంధుదత్తునియొద్ద నికాయవిద్య గఱచెను. అతడు కచ్ఛ దేశమునుఁ జేరి విమలాక్షుని యొద్ద రాజ విహారమున వినయము నభ్యసించెను.

చీనాచక్రవర్తి సేనల నంపి కచ్ఛరాజును కుమారజీవునిఁ బంపమని కోరెను. కచ్ఛరాజు సమ్మతింపలేదు. ఘోరయుద్ధమున చీనా సేనాధిపతి కుమారజీవుని బందీకృతుని

జేసి చీనాకు తీసికొనిపోయెను. క్రీ. శ. 401 లో చీనాచక్రవర్తి కుమారజీవుని బౌద్ధమత ప్రచారముఁ జేయ బ్రార్థించెను. పండ్రెండు సంవత్సరములలో నతఁడు శతాధిక సంస్కృత గ్రంథములను చీనాభాషలోని కనువదించెను. అతని యనువాదములు చీనాలో మాతృకలకంటె నెక్కువ ప్రాముఖ్యమును వహించినవి. చీనావాఙ్మయమున నతని రచన లుత్తమ సారస్వత కల్పనములు. అతఁడు—అశ్వఘోష, నాగార్జునుల జీవిత చరిత్రలనుఁ గూడ చీనాభాషలో రచించెను. ఇతఁడే విశ్వవిఖ్యాతిఁగన్న పాహియాన్ యాత్రికునిగురువు. తన గురువైన విమలాక్షునితో, బుద్ధభద్ర, పుణ్యత్రాత పండితులతో గలిసి పనిఁజేసెను.

కాశ్మీరమా కాలమున నొక బౌద్ధవిజ్ఞానకేంద్రము. బుద్ధయశస్సు, ధర్మయశస్సు, ధర్మక్షేముఁడు, ధర్మమిత్రుఁడు కాశ్మీరమునుండి చీనాఁ జేరిరి. క్రీ. శ. 414—421 సంవత్సరములలో ధర్మక్షేముఁడు చీనాభాషలోని కశ్వఘోషుని బుద్ధచరిత్రము, మున్నగు గ్రంథముల ననువదించెను. ఇతఁడు మధ్యభారతవాసి. ఇద్దరు చీనారాజులితనినొంటకై తగవులాడుకొనిరి. ఫలిత మతనిహత్య.

కాశ్మీర పండితులలోఁ బేర్కొనఁ దగినవాఁడు గుణవర్మ. రాజవంశీయుఁడైన యితని నప్పటిరాజు పుత్రుఁడగుటచే రాజుగ నెన్నుకొనిరి. కాని ఇతఁడు కిరీటముఁ ద్యజించి సిం

పాళముఁ జేరి యచ్చటనుండి యవద్వీపమునకుఁ బోయెను. ఫాహియాన్ అంతకుముందచ్చట హిందూధర్మము ప్రబలి యున్నదని వ్రాసెను. గుణవర్మ యవద్వీపమున బౌద్ధమత విస్తరణకుఁ గారకుఁడు. ఇతనికీర్తివిని యప్పటి చీనా సార్వభౌముఁడు క్రీ. శ. 424 లో నితని నాహ్వానించుటకు రాయబారులనంపెను. అతఁడంతకు బూర్వమే యొక భారతీయ నౌకలో ననుకూల వాయుప్రసారణమున కాంటన్ జేరుకొనెను. భారతీయవిద్వాంసుని స్థానికాధికారులు మర్యాదలు సలిపి రాజధానికిఁ దోడ్కొనిపోయిరి. క్రీ శ. 431 వ సంవత్సరమున నతఁడు నాన్-కింగ్ చేరెను. చక్రవర్తి స్వయముగా నాతనికి స్వాగతమిచ్చి జేతవన విహారమున నతనికి వసతిఁ గల్పించి యతని శిష్యుఁడయ్యెను. అతఁడు బౌద్ధసంఘారామము స్థాపించెను. క్రీ. శ. 435—443ల మధ్య గుణభద్రుడు గణనీయుఁడు. ఇతఁడు మధ్యభారతవర్షవాసి. డెబ్బదిమైదు మహాయాన సిద్ధాంత గ్రంథములనుఁ జీనాభాషలోని కనువదించెను. అతఁడు తన డెబ్బదిమైదవయేట క్రీ. శ. 468 లో నిర్వాణమొందెను.

ఆఱవశతాబ్దిలోఁ గూడ చీనాలో ననేక భారతీయ విద్వాంసులు విజ్ఞానప్రచార మొనర్చిరి. ధర్మరుచి, రత్నమతి, బోధిరుచి, బుద్ధశాంత, గౌతమ ప్రజ్ఞారుచి, ఉపశూన్య విమోక్షసేన పండితులు వారిలో ముఖ్యులు. ధర్మరుచి దక్షి

గాపథవాసి. రత్నమతి మధ్యభారత వాసి. అతఁడు మహా యానతంత్ర శాస్త్రమును, సద్ధర్మ పుండరీకమును ననువదించెను. క్రీ. శ. 498—535 లోపున బోధిరుచి లంకావతార సూత్రము మున్నగు ముప్పది గ్రంథముల ననువదించెను. క్రీ. శ. 524—539 సంవత్సరములలో బుద్ధశాంతుడు పదిగ్రంథముల భాషాంతరీకరణము నొనరించెను. క్రీ. శ. 538-541 లలో కాశీ పండితుఁడు గౌతమ ప్రజ్ఞారుచి చీనాభాషలోనికి మూడుగ్రంథములు ననువదించెను. ఉపశూన్యుఁ డుజ్జయినీ రాజపుత్రుఁడు సింహాసనముఁ ద్యజించి సన్యసించెను. క్రీ. శ. 538—540 లలో మూడుగ్రంథములు 545—565 లలో రెండు గ్రంథముల ననువదించెను.

నరేంద్ర యశస్సు, భారతసింహళ దేశముల బర్యటించి హిందూకుష్ పర్వతములఁదాటి నైదుగురు పండితులతో క్రీ. శ. 556 లో చీనాను జేరెను. క్రీ శ. 577 లో బౌద్ధ మత ప్రతికూల రాజవంశము ప్రభుత్వముఁ స్వీకరించెను. ఈ బౌద్ధ పండితులు ప్రవాసులైరి. తిరిగి 581లో బౌద్ధమతాను కూలపరిభుత్వ మేర్పడినది. క్రీ. శ. 575 నుండి 585 వరకు భారతభూమినిఁ బర్యటించిన చీనాబౌద్ధభిక్షుక సంఘము కొన్ని సంస్కృత గ్రంథములతో తిరిగివచ్చిరి. క్రీ. శ. 582 లో నరేంద్రయశస్సు — ఆధిపత్యమున ముప్పదిమంది యనువాద కులనుఁ జక్రవర్తి నియమించెను. మూడుసంవత్సరములలో

నతఁ డెనిమిది గ్రంథముల ననువదించి క్రీ. శ. 589 లో నిర్వాణ మొందెను.

ఉజ్జయినీవాసి పరమార్థుఁడు క్రీ॥ శ॥ 548 లో నాన్‌కింగ్ నుఁ జేరెను. క్రీ॥ శ॥ 569 లో నిర్వాణముఁజెందునాటి కతఁడేబది గ్రంథములననువదించెను. అతని తర్క శాస్త్రము వసుబంధుని జీవితచరిత్రము చీనా వాఙ్మయమున సుప్రసిద్ధములు.

క్రీ॥ శ॥ 557 వ సంవత్సరమున జ్ఞానభద్రుఁడు జినయశస్సు వారిశిష్యులు. జినగుప్తుఁడు యశోగుప్తుఁడు చీనాఁ జేరిరి. ఇందు జినగుప్తుఁడు సుప్రసిద్ధుఁడై బుద్ధచరిత్ర సద్ధర్మ పుండరీకముల ననువాదము సలిపెను. అతఁడు గాంధార వాసి పురుషపురపౌరుఁడు; క్షత్రియుఁడు. ఏడవయేటనే మహావన విహారముఁజేరెను. అతఁడు గురువులతోఁగూడి యిరువదియేడవ యేట చీనాకు ప్రయాణ మారంభించెను. క్రీ॥ శ॥ 577 వ సంవత్సరమున చీనాఁజేరి యచట చక్రవర్తి నిర్మించిన నూతనవిహారమున ననేక సంస్కృత గ్రంథముల ననువదించెను. క్రీ॥ శ॥ 577 లో బౌద్ధప్రతికూలరాజవంశ ప్రభుత్వ మేర్పడుటవలన జినగుప్తుఁడు తురకలతో నివసించెను. 581 లో తిరిగి చీనాబౌద్ధభిక్షుక సంఘమును కలసికొని చీనాను జేరెను. నరేంద్రయశస్సు — ఆధిపత్యమున తరువాత జినగుప్తుని యాజమాన్యమునను, చీనాభారతీయ పండితులు

ముప్పదిమందికలసి యనేక సంస్కృత గ్రంథముల ననువదించుట జరిగినది. ఇతఁడు కొన్ని జ్యోతిషగ్రంథముల ననువదించెను. క్రీ॥ శ॥ 600 సంవత్సరములో నితఁడు నిర్యాణము నందెను. క్రీ॥ శ॥ 577 లో కాశీపండితుఁడు గౌతమప్రజ్ఞారుచి కుమారుఁడు గౌతమధర్మజ్ఞానుని చక్రవర్తి యిరువదియైదు మండలములకు బరిపాలకునిగా నియమించి గౌరవించెను.

జినగుప్తుఁడు వెళ్ళిన కష్టమార్గమునే యనుసరించి ధర్మగుప్తుఁడు చీనాను క్రీ॥ శ॥ 590 లోఁ జేరెను. అతఁడు 619 లో మరణించువరకు నిదానసూత్రము, శాస్త్రము మున్నగు గ్రంథము లనేకముల ననువదించెను. వినీతరుచి క్రీ॥ శ॥ 582 లో చీనాచేరెను. క్రీస్తుశక మేడవ శతాబ్దిలో చీనా జేరిన భారతీయపండితు లార్గురునూత్రమే కన్పించుచున్నారు. భారతదేశమున నాశతాబ్దిలో సుప్రసిద్ధ చీనాయాత్రికులు యువాన్‌చాంగ్, ఇట్సింగ్, వాంగ్, యువాన్‌చీ—చరిత్రాత్మక యాత్రలు సల్పిరి.

మధ్యభారతవాసి ప్రభాకరమిత్రుఁడు క్రీ॥ శ॥ 687 లో వచ్చి ప్రజ్ఞాప్రదీప శాస్త్రటీక - సూత్రాలంకారటీక యను గ్రంథముల రచించెను. క్రీ॥ శ॥ 633 లో నితని నిర్యాణము.

క్రీ॥ శ॥ 652 లో నతిగుప్తుఁడు ధారణీసంగ్రహసూత్రము ను వ్రాసెను. గంది క్రీ॥ శ॥ 655 లో పదునైదువందల

మహాయానహీనాయానముల గ్రంథములతోఁ జీనా జేరెను. అతనిని దూరదేశములకు చక్రవర్తి యొక యూపథముకొరకుఁ బంపెను. ఏడుసంవత్సరముల యనంతరమాతఁడు తిరిగివచ్చి మూఁడుగ్రంథముల ననువదించెను. క్రీ॥ శ॥ 676-681 సంవత్సరముల దివాకరుఁడు, మధ్యభారత వాసి పంద్రొమ్మిది గ్రంథముల భాషాంతరీకరించెను. 693—713 సం॥లలో కాశ్మీర రత్నచింతపండితుఁ డేడుగ్రంథముల ననువదించెను. దక్షిణాపథవాసి ధర్మరుచి కాశ్యపగోత్రిక బ్రాహ్మణుఁడు. అతనినామము చీనాచక్రవర్తి బోధిరుచిగ మార్చెను. ఇతఁడు 693—713 సం॥ లలో నేబదిమూఁడు గ్రంథముల ననువదించెను. స్మిమితి, మేఘశిఖాపండితు లొక చీనాపండితుని సాహాయ్యముతో క్రీ॥ శ॥ 705 లో నొక గ్రంథము ననువదించిరి.

క్రీస్తుశక మెనిమిదవశతాబ్దిలో విదేశమున విజ్ఞాన ప్రచార మొనర్చిన పండితులలో బోధిసేనుని చరిత్ర పేర్కొనదగినది. బోధిసేనుఁడు దక్షిణాపథనివాసి. భారద్వాజగోత్రికుఁడు. చీనాదేశకీర్తి యతని నాకర్షించెను. అదియునుగాక సుప్రసిద్ధుఁడైన మంజుశ్రీ పండితుఁ డచ్చటనున్నట్లు విని యాతని సందర్శింపనెంచి బోధిసేనుఁడు చీనాకు బయలుదేరెను. మార్గమధ్యమున నతఁడు చంపాదేశవాసియగు భూతేశుఁడను బౌద్ధభిక్షుకుని గలిసికొని, యతనితోఁ గలసి క్రీ॥ శ॥ 733 సంవత్సరమున చీనాదేశమును జేరెను. అచ్చట

మంజుశ్రీ జపానుదేశమునకు వెళ్ళెనని యెవరో భిక్షుకుఁ డొకడసత్యమును దెలిపెను. చీనారాజాస్థానమునుండి వీడ్కోలు గైకొని స్వదేశమునకు మరలుచున్న జపాను రాయబారులు బోధిసేనుని తమదేశమునకాహ్వానించిరి. బోధిసేనుడా యాహ్వానమును సంతోషపూర్వకముగ నంగీకరించి, క్రీ॥ శ। 736 సంవత్సరమునననివా (నేటి యొకొసా) చేరుకొనెను. జపాను రాజాస్థానోద్యోగులు బోధిసేనున కఖండస్వాగత మొసంగి గౌరవించిరి. బోధిసేనుఁడు మిత్రుఁడైన భూతేశునితోఁ గలిసి రాజాస్థానమున నతిథిపూజా గౌరవముల నందుచు నివసించెను. క్రీ॥ శ॥ 749 సంవత్సరమున బుద్ధవైరోచన విగ్రహసంస్థాపనమున బోధిసేనుఁడు యాజమాన్యము వహించెను. క్రీ॥ శ॥ 750 సంవత్సరమందతఁడు జపానునందలి బౌద్ధవిహారము లన్నిటిపై పీఠాధిపతి "సోజో" యయ్యెను. అతనిని "బ్రాహ్మణసోజో" యని యచ్చటివారు పిలిచెడివారు. అతఁడు క్రీ. శ. 760 సంవత్సరమందలి నిర్యాణమువర కతఁడు సంస్కృతమును మహాయాన గండవ్యూహసిద్ధాంతమును జపానులోఁ బ్రబోధము సల్పెను. జపానుభాషాక్షర వికాసమున కాతఁడు దోహదము కల్పించెను. బోధిసేనుని నిర్యాణానంతరము పదిసంవత్సరముల తర్వాత నిర్మింపబడిన స్మారకస్థూపము శాసనయుతమై నేటికిని జపానులో నిలిచియున్నది.

దక్షిణభారత దేశమునుండి చీనాకు వెళ్ళిన ప్రాచీన విజ్ఞాన ప్రచారకులలో వజ్రబోధి చిరస్మరణీయుఁడు, క్రీ॥ శ॥ 661 సంవత్సరమున నతడు జన్మించెను. అతఁ డిరువదియారు వత్సరముల ప్రాయమువరకు నాలందావిహారమున నున్నత విద్య నభ్యసించి క్రీ॥ శ॥ 689 సంవత్సరమునఁ గపిలవస్తు పురికిఁ దీర్థయాత్రసల్పి యవలోకితేశ్వర సిద్ధాంతము ప్రచారమందున్న దక్షిణాపథమునకుఁ దిరిగి వచ్చెను. అప్పుడు కాంచీపుర మనావృష్టిచే బాధనొందుచుండెను. మహారాజు నరసింహపోతవర్మ వజ్రబోధిని ప్రార్థింప నతఁడు తన ప్రార్థనా మాహాత్మ్యమున వర్షములగురిపించెనని చెప్పబడి నది. వజ్రబోధికి సింహళమున కేగి మంజుశ్రీ పండితుని గలిసి కొనవలెనని స్వప్నమున నిర్దేశమేర్పడినది. అతఁడు సేతువు నధిగమించి సింహళమును జేరెను. సింహళమున వజ్రబోధి కఖండస్వాగత పూజాగౌరవములు లభించినవి. పవిత్ర బుద్ధ ధాతువుల నర్చించుచు నతడు సింహళమున నారుమాసములు గడపెను. అతడు కాంచీపురికిఁ దిరిగివచ్చి, నరసింహవర్మ యనుమతితో రాయబారులగలిసి చీనాయాత్ర కుపక్రమించెను.

క్రీస్తుశకము పదునొకండవశతాబ్దిలోఁ జీనాభాషలో విరచితమైన విజ్ఞానసర్వస్వము దక్షిణాపథ మహారాజాలం

చీనాచక్రవర్తుల కడకు రాయబారుల నంపినట్లు పేర్కొనుచున్నది. శీలాదిత్యుఁడు, చాళుక్యవల్లభమహారాజు క్రీ॥ శ॥ 692 సంవత్సరమున చీనాచక్రవర్తి కడకు రాయబారులనంపించిరి. క్రీ॥ శ॥ 720 సంవత్సరమున నరసింహవర్మ మహారాజు - రాజరాజు నామాంతరమున సుప్రసిద్ధుఁడైన కాంచీ ప్రభువు చీనాచక్రవర్తియొద్దకు రాయబారుల నంపించెను. ఈ రాయబారులలో ముఖ్యుడు వజ్రబోధియనుట నిస్సందేహము. చీనాచక్రవర్తి రాజరాజుకడకుఁ దిరిగి కానుకలతో తన రాయబారుల నంపెను.

వజ్రబోధి చీనాను సముద్రమార్గమున మిక్కిలి ప్రయాసలకోర్చి చేరెను. వజ్రబోధి రాయబారులతో గలసి కాంచీపురినుండి సింహళమును మొదటఁ జేరెను. అచ్చట పారశీక వర్తకుల యోడలు రత్నవర్తకమునకై వచ్చియున్నవి. వజ్రబోధి యా రత్నవర్తకులతో మైత్రినెరపి, యొక నెల సింహళముననుండి యచ్చటినుండి వారితో గలసి శ్రీవిజయను జేరెను. అచ్చటినుండి వారు చీనాకు బయలు దేరిరి. కాని యాప్రయాణమున తుపానులో నోడలన్నియు చెల్లాచెదరై పోయినవి. ఎన్నో బాధలుపడి, చిట్టచివరకు క్రీ॥ శ॥ 720 సంవత్సరమున వజ్రబోధి కాంటన్ నగరమును చేరుకొనెను. అతఁడు చక్రవర్తి ప్రార్థనచే చీనాలోనే నిలిచిపోయెను. అతడు క్రీ. శ. 732 సంవత్సరమునఁ చీనాదేశము

న నిర్వాణమొందెను. సింహళమున కేగినపుడు వజ్రబోధి మహాయానమును బ్రవేశపెట్టెను. మరణమునకుముందు వజ్రబోధి తనశిష్యుఁడైన యమోఘవజ్రుని సింహళమున కేగి తానారంభించిన మహాయాన ప్రచారమును గొనసాగింప నాదేశించెను. అమోఘవజ్రుఁడు గురూపదేశమును బాటించి సింహళమున మహాయానమును సుస్థిరముగఁ బాదుకొల్పెను.

క్రీ. శ. 716 లో నాలందా విహారపండితుఁడు శుభాకరసింహుఁడు చీనానుఁజేరి 730 లోపున నాలుగు గ్రంథముల ననువాదముఁ జేసెను. 735 లో తొంబదితొమ్మిదవయేట నిర్వాణ మొందెను.

ఎనిమిదవశతాబ్దిని చీనాఁజేరిన భారతీయపండితులలో ప్రముఖుడమోఘవజ్రుఁడు క్రీ. శ. 719 లో నతని గురువు వజ్రబోధితో గలసి చీనాజేరెను. క్రీ. శ. 732 లో గురు నిర్వాణానంతరము 741 లో భారతదేశముఁజేరి సింహళము వరకు పర్యటించి యనేకవ్రాతప్రతులతో 746 లో చీనాకు తిరిగి వెళ్ళెను. అతని వైదుష్యముఁ బరికించి చక్రవర్తి 'ప్రజ్ఞామోక్ష' బిరుదముతో నతనిని సత్కరించెను. తరువాత నతనికి "త్రిపీటకాభదంత" బిరుదము నిచ్చి గౌరవించెను. అతఁడు 749 లో మాతృభూమినిఁ జేరనిశ్చయించి సముద్ర తీరమునుఁ జేరెను. కాని చక్రవర్తి యతనిని తిరిగి పిలిపిం

చెను. అతఁడు డెబ్బదియేడు గ్రంథముల భాషాంతరీకరించెను. అమోఘవజ్రుని తర్వాత చీనా వెడలిన భారతీయ పండితుల పేర్లు మృగ్యములు.

తొమ్మిదవశతాబ్దిలో నొక పేరునుఁ గనిపించుటలేదు. పదియవశతాబ్దిలో నంజిమో పట్టిక ననుసరించి చీనాలోని భారతీయ పండితులు ముప్పురుమాత్రమే. క్రీ॥ శ॥ 973 లో నాలందావిహార పండితుఁడు త్రిపీఠికాచార్యుఁడు, ధర్మదేవుఁడు చీనా జేరుట జరిగినది. అతఁడొక యనువాద సంఘాధ్యక్షుఁడై దానపాలునితో చీనాపండితులతో గలిసి నలుబదియూఱు గ్రంథముల ననువదించెను. అతడు 1001 లో నిర్యాణము నొందెను.

. మగధదేశవాసి ధర్మరక్షపండితుడు బౌద్ధగ్రంథములతో చీనాచేరి పండ్రెండు గ్రంథముల ననువదించెను. సూర్యయశస్సుగూడ నానమయమున చీనానుజేరిన మఱియొక భారతీయ పండితుఁడు 1110 లో మైత్రీయభద్రుఁడు చీనా రాజగురువు. అతఁ డైదుగ్రంథముల ననువదించెను. పదునొకండవశతాబ్దితో చీనాలో భారతీయ పండితుల విజ్ఞానదిగ్విజయ యాత్రలు సమాప్తిఁ జెందినవి.

చీనాదేశమునుండి విజ్ఞానజిజ్ఞాసువులై యమానుష ప్రయాసలకోర్చి భారతభూమికి వచ్చిన యాత్రికులు చరిత్రలో వెలసినారు. ఎందరో భారతీయ విద్వాంసులు

వేయి సంవత్సరములపాటు చీనాలో విజ్ఞానప్రచార మొనరించినారు. కాని — యీ యధ్యాయము ప్రపంచ చరిత్రలోఁ బొందఁ దగిన ప్రాముఖ్యమును బొందలేదు. చీనావాఙ్మయమంతయు భారతీయపండితుల యుజ్జ్వలసృష్టి. భారతీయపండితులు, నున్నతగహనపర్వత పంక్తులను నరసంచారములేని యెడారులు నడవులుఁ దాటి ప్రమాదములకోర్చి ప్రాణభీతిఁ ద్యజించి మొట్టడారులహిమాలయముల నధిగమించి చీనాను జేరెడువారు. చీనా యాత్ర యీ పండితులకు శాశ్వతస్వచ్ఛంద ప్రవాసము. అనన్య స్వార్థత్యాగము. అతిలోక విజ్ఞాన పరతంత్రత. ఇట్టి యతిలోక విజ్ఞానదీక్షయే భారతదేశమునందలి విద్యానిలయములందు చీనా టిబెట్టు మొదలగు పరభాషా ప్రబోధమునకు దోహదము కల్పించినవి. ఈ పండితులకు స్వార్థత్యాగముతోఁబాట పారశైదుష్యమవసరము. చీనావంటి క్లిష్టభాషాపారంగతత్వము పరభాషలో గ్రంథనిర్మాణము పాండిత్యమునకు నిర్మల శీలసాహాహార్యము వలన సిద్ధించినది.

భారతదేశ చరిత్రలో నత్యద్భుత ఘట్టము చీనాలో భారతీయ విద్వాంసుల సహస్రసంవత్సర విజ్ఞానదిగ్విజయ యాత్ర.

ఓం

ఉదయిని ప్రెస్, భీమవరం